# ఈశ్వర విశ్వరూపము

(నమక చమకములు వ్యాఖ్యాసహితము)






"శాంతిశ్రీ"

జంధ్యాల వేంకటేశ్వర శాస్త్రి

ప్రశాంతి నిలయము

సర్వస్వామ్యములు రచయితవి
ప్రథమ ముద్రణ 1993
ప్రతులు వెయ్యి

వెల రు. **45**

ఆర్ష ధర్మ ప్రచారకులైన తిరుమల తిరుపతి దేవస్థానముల వారి
ఆర్థిక సహాయముతో ప్రచురితమయినది.

ప్రతులకు :

"శాంతిశ్రీ" జంధ్యాల వేంకటేశ్వరశాస్త్రి
ఈస్ట్ బ్లాక్ పెనుక లైన్, ప్రశాంతినిలయం
పుట్టపర్తి, అనంతపురం జిల్లా

నవోదయ పబ్లిషర్స్
విజయవాడ

ముద్రణ :

చైతన్యప్రింటర్స్,
విజయవాడ-2

# అంకిత పారిజాతము

స్వామి ! ఆనందనిలయ ! ప్రశాంతి నిలయ !
తిరుపతి నివాస ! పుటపర్తి పురి నివాస !
సర్ప మృదు తల్పశాయి ! శ్రీ సత్యసాయి !
మానసాద్వైత మూర్తి ! నమస్కృతమ్ము !

నా పాదములు ఎన్ని నాట్యాలు చేసినా అది నీవు సేయుమన్నంతవరకే;
నా కన్నులెన్ని విన్యాసాలు చూపినా అది నీవు చూపుమన్నంత వరకే;
నా గళం బెన్ని గాంధర్వాలు పలికినా అది నీవు పలుకు మన్నంతవరకే;
నా మనస్సెన్ని అందాల ఊరేగినా అది నీవు ఊరకున్నంతవరకే;

రథము దేహము - దీని సారథివి నీవు
జీవుడను నేను - జగదేక దైవ మీవు
నీవు లేకుండ క్షణమైన నిలువలేను
సాకుచుండుము కరుణతో సాయిదేవ ! -

తిరుపతివై—సమస్త జగతీపతివై-గిరిజామహామహే
శ్వరిపతివై—కటుంగడు ప్రజాపతివై—సమవర్తియాసురే
శ్వరపతివై -సుధాకరయశః పతివై—శ్రుతివై—త్రిలోకులం
దరిగతివై ప్రశాంతిగిరి దర్శనమిచ్చు ప్రభూ! నమోనమః !

శ్రీశైలంబగు నీ ప్రశాంతి నిలయ శ్రీ మందిరంబందు నీ
ఆశీః కాంతి లవంబు సుప్తమగు నాయాత్మన్ ప్రవేశించి ఆ
వేశంబై కృతిరూపు దాల్చినది నీ విశ్వస్వరూపంబు స
ర్వేశా ! ప్రేమడి స్వీకరింపు ! భగవాన్ సత్యసాయీశ్వరా !

# వాగుపహారము

**ఆచార్య శ్రీ శలాక రఘునాథ శర్మ**
శ్రీకృష్ణదేవరాయ విశ్వవిద్యాలయం
అనంతపురం

పరమేశ్వరుడు నాద తనువని శాస్త్రములు చెప్పుచున్నవి. నాదము వేదముఖమున హృదయమున అనుభూతికి వచ్చును. కావున 'వేదారాధన'మనగా నాదాత్మక పరమేశ్వరారాధనమే. 'వర్ణము-స్వరము-మాత్రబలము-సామము-సంతానము' అను ఆరు లక్షణములను జాగరూకతతో పాటించుచు వేద పారాయణము చేయుట ఆరాధనలో మొదటి మెట్టు. మహిమోపేతమగు అర్థమును అనుభవమునకు తెచ్చుకొనుచు వేదవేద్యుని హృదయగుహలో పాదుకొలుపుకొనుట తుది మెట్టు.

వేదములు అనంతములు. అన్నింటిని అర్థ సంభావనతో అంతరంగమున పదిలపరచుకొనుట అందరకు సాధ్యమగునా? కానిచో మానవత్వమునకు మాధవత్వ సిద్ధి యెట్లు కలుగును. అని శంకింపనక్కరలేదు. అనంత సూర్యతేజమున ఆవంత కాంతి కిరణము దేహమునకు తాకినంత మాత్రమున కలుగవలసిన చైతన్యము కలుగుచునే యున్నది కదా !

ఆ దృష్టితో ఆర్షమహాదీప్తిని అత్యధిక ప్రమాణములో అందుకొనిన బ్రహ్మవిద్యరేణ్యులు వేద మార్తాండుని నుండి కొన్ని జ్యోతులను అందుకొని మానవ సమాజ సముద్ధరణకై ముందునకు త్రోసి అందించు యత్నమొనర్చిరి. అట్టివానిలో నమక చమకములు పురుషసూక్తము అరుణము మొదలగునవి మానవ సమాజమునకు సన్నిహితముగానున్న పరంజ్యోతులే.

వాని దివ్య దీధితులను శ్రద్ధాభక్తులతో హృదయ పేటికలో పదిలపరచుకొన్నవాడు అఖండ సచ్చిదానంద నాదాత్మక పరబ్రహ్మ సామ్రాజ్యములోనికి అడుగు పెట్టుచున్నవాడే అగును. అట్టి దివ్యజ్యోతులలో సర్వవిధముల నెన్నదగినవి నమక చమకములు. ఇవి వేదక్షీరసాగరమునుండి ఉబుకుకొనివచ్చిన అమృత కలశములు.

నమకము పరమేశ్వరుని విరాట్ స్వరూపమును, చమకము విశ్వమునందలి అనశ్వర మహాసంపదను వర్ణించుచున్నవి. వేద నాదారాధకుడు అణువణువున తోచెడు అవిరాట్స్వరూపమునకు ఆత్మార్పణము కావించుకొనవలయును. నమస్కార

తాత్పర్యమదియే "నమోఽస్తుతే సర్వత ఏవసర్వ" అనుగీతావాక్య తాత్పర్యము కూడా అదియే.

కావుననే విశ్వమంతట నిండిన పరమేశ్వర విభూతులను పేర్కొని నమస్కరింపుమనుచున్న వేదభాగము 'నమకము.' ఆ భావమునకు పూరకముగా విశ్వమునందలి విశిష్ట వస్తు సంచయము 'నాకు లభించుగాక!' అను ఆశాసనమును అభివ్యక్తము జేయునది 'చమకము' అట్లు విశ్వము నంతటిని తనలో నింపుకొనుట విశ్వేశ్వరునకు సమర్పణము చేసికొనుటకే. కనుక ఇది సదాశయే కాని దురాశకాదు. కావున ఆ భావము వలన సిద్ధించునది ఆనందానుభూతియేకాని దుఃఖముకాదు. ఇట్లు ఇవి రెండును పరస్పర పూరకములైన పరమ మంత్రములు.

వేద మంత్రములకు మున్ను మహానుభావులు వ్రాసిన మహాభాష్యములు కలవు. వాని మహిమ అనంతము. కాని అవి మహాపండితైక వేద్యములు. కాలవైపరీత్యము వలన అట్టి మహానుభావులును అందుబాటులో లేని దుస్థితి వచ్చిపడినది. మరి ఆ జ్ఞానగంగ సర్వమానవ హృదయ క్షేత్రములలో జాలువారి బ్రహ్మానందపు పంటపండించుట యెట్లు ?

ప్రశాంతి నిలయము మొదటి నుండియు ఈ ప్రశ్నకు సమాధానము చెప్పుచునే యున్నది. వేద విద్యాతరువునకు పాదులను తీర్చి దోహదము చేయుచునే యున్నది.

భగవాన్ శ్రీ సత్యసాయీశ్వరుల తనువెల్ల వేదనాదమయము. కావున అందీ విద్య అందలమెక్కి కూర్చుండుటలో వింత ఏమున్నది? అట్టి ప్రశాంతి నిలయమున ప్రశాంత జీవనము గడుపుచు శ్రీస్వామి దివ్యబోధనలను శ్రవణ మనన నిధిధ్యాసల ద్వారా అనుభమునకు తెచ్చుకొనుచున్న బ్రహ్మశ్రీ వేదమూర్తులు 'శాంతిశ్రీ' జంధ్యాల వేంకటేశ్వరశాస్త్రిగారు నమక చమక మంత్ర వ్యాఖ్యాన రూపమున "ఈశ్వర విశ్వరూపము"ను సమాజమునకు సన్నిహితము చేయవలయునని సంకల్పించుట ముదావహమైన విషయము. వారు తీర్చిన వ్యాఖ్యానము యథామతి పరిశీలించితిని.

ఇది సులభ సుందరముగా రూపొందినది. కావున జిజ్ఞాసువులకు అందరకు అందుబాటులో నుండునని నేను దృఢముగా విశ్వసించుచున్నాను. సరళమైన భాషలో సులభమైనతాత్పర్యమునుకూర్చుట-ప్రామాణ్య బుద్ధికలిగించుటకై భాష్యకారులఅడుగు

జాడలలో నడచుచు ప్రతిపదార్థమును వ్రాయుట - ఈ వ్యాఖ్యయందలి గుణవిశేషములు. అన్నింటి కంటె మెప్పుగొలుపు అంశమొకటి ఇందు ప్రత్యేకముగా గుర్తింప దగినది కలదు. శ్రీ శాస్త్రిగారు ఎంతో శ్రమపడి సంస్కృతాంధ్ర వాఙ్మయముల నుండి రత్నముల వంటి శ్లోకములను పద్యములను తత్తన్మంత్రవ్యాఖ్యాత్మకమొలైన వానిని— ఏర్చి కూర్చి పాఠకుల హృదయముల నాకట్టుకొనుటకు చేసిన ప్రయత్నము సర్వథాప్రశంసనీయము. ఇది వ్యాఖ్యాన సంప్రదాయమున కొక క్రొంగ్రొత్త సౌందర్యమును కూర్చు విషయము. దీనివలన పాఠకునకు మంత్రార్థ జ్ఞానముతోపాటు మంచి సాహిత్య జ్ఞానము కూడా సిద్ధించును.

ఇట్టి ఈ వ్యాఖ్య సర్వవిధముల సర్వజనామోదము పడయుటకు వలసిన సామగ్రిని సంతరించుకొన్నదని నేను గట్టిగా నమ్ముచున్నాను. ఇట్టి అమూల్య భండారమును మనకందించుచున్న శ్రీ శాస్త్రిగారిని మనసార అభినందించుచున్నాను. వారికి నా యందు కలిగిన అవ్యాజానురాగమునకు కృతజ్ఞతలు తెలియజేయుచున్నాను

శ్రీ శాస్త్రిగారు ఏ పరమార్థమును వాంఛించి యీ మహోన్నత కృషిచేసినారో వారికి ఆ పరమార్థమును శ్రీ సత్యసాయి భగవానులు అందింతురని విశ్వసించుచున్నాను. "తేజస్వినావధీతమస్తు"

# నమో మహద్భ్యః

అచింత్యం చాప్రమేయంచ
వ్యక్తా వ్యక్త పరంచయత్
సూక్ష్మాత్సూక్ష్మతరం జ్ఞేయం
పరమేశం నమోనమః !

ఇది ఈశ్వర విశ్వవిరాడ్రూపం. ఇది సర్వవ్యాప్తము. "ఈశావాస్యమిదం సర్వం" విశ్వంలోగల అన్ని రూపాలు ఈశ్వరునివే. జ్యోతిర్గణాలు జీవగణాలు స్థావరాలు నదీ పర్వతాలు అణువులు పంచభూతాలు సమస్తం సర్వేశ్వర స్వరూపాలే "ఈశ్వరస్సర్వ భూతానాం!"

భద్రప్రదం రుద్రం. ఇదే శత రుద్రీయం. ఇదీ రుద్ర స్వభావం వర్ణిస్తుంది. ఇది నమస్సులతో నిండి వున్నది కనుక నమకం అన్నారు. అగ్నా విష్ణువులను భక్తకోటి అనేక విధాలుగా అర్థిస్తుంది.ఈ అభ్యర్థనలో చ అంటే ఇంకా, ఇంకా అని అభ్యర్ధన కనుక దీనిని చమకం అన్నారు.

నమక చమకాలలో అనేక అనువాకాలున్నాయి. ఒక్కొక్క అనువాకంలో అనేక ఋక్కులు యజుస్సులున్నాయి. ఈ ఋక్కులకు యజస్సులకు తెలుగులో నా నేర్చిన భంగి వ్యాఖ్యానం చేశాను. విజ్ఞులు సాదర దృష్టితో అవలోకింతురు గాక.

ఈ పుస్తక ప్రచురణకు ఆర్థిక సహాయం అందించిన శ్రీ వేంకటేశ్వర స్వామికి నా హృదయ పూర్వక ప్రణామాలు. తిరుమల తిరుపతి దేవస్థానముల కార్య నిర్వహణాధికారి గారికి, సప్తగిరి సంపాదకులు శ్రీ సుబ్బారావుగారికి ధన్య వాదములు.

ఉదయ సాయం సంధ్యాసమయాలలో అద్భుతమైన దర్శనం ప్రసాదించే కదిలే దేవుడు, పలికే దేవుడు, చిరునవ్వులు చిందించే దేవుడు, నన్ను నడిపించే దేవుడు శ్రీ సత్యసాయి పరంధాముడు సాక్షాత్తు ఈశ్వరుడే. ఈశ్వర విశ్వరూపాన్ని సాయీశ్వరుని పాదపద్మములపై సమర్పిస్తున్నాను.

— శాంతిశ్రీ

ఓం

సాయీశ్వరాయ విద్మహే
సత్యదేవాయ ధీమహి
తన్నస్సర్వః ప్రచోదయాత్

"శ్రీ సత్యసాయిని సాక్షాత్ భగవంతుడని, ఈశ్వరుడని గురువుల్ల, శాస్త్రాలవల్ల తెలిసికొంటున్నాను.

పరబ్రహ్మ స్వరూపుడైన ఈ సాయిపరమేశ్వరుడు మా యొక్క బుద్ధులను మంచి పనులయందు ప్రేరణ చేయునట్లు ప్రార్థిస్తున్నాను.

ఈ సత్యసాయి మూర్తిని సత్య స్వరూపుడుగా, చిత్స్వరూపుడుగా, సర్వజగద్వ్యాపకుడుగా, సర్వదేవతా స్వరూపుడుగా నా హృదయంలో మనః పూర్వకంగా ధ్యానిస్తున్నాను."



# ఈశ్వర విశ్వరూపము

సూక్ష్మరూపాన శ్రీనివాసుండు - భువిని
స్థూల రూపాన పర్తివాసుండు - నన్ను
బాగుసేయ ప్రయత్నించ సాగినారు
కర్మగతి ఎట్లొ ! సుగతి సంక్రమణ మగుత !

# శ్రీ రుద్ర సంకల్పమ్

ఆచమ్య........ లఘున్యాస... ఏకాదశ రుద్రాభిషేకం. ..

అస్యశ్రీ రుద్రస్య ప్రశ్నస్య
అఘోర ఋషిః అనుష్టుప్ ఛందః
సంకర్షణమూర్తి స్వరూపోయో ఽ సావాదిత్యః
పరమపురుషః స ఏవ రుద్రో దేవతా అగ్నిక్రతు
చరమిష్టకాయాగ్ం శతరుద్రీయ జపాభిషేకే వినియోగః

సకలస్య శ్రీరుద్రాధ్యాయస్య శ్రీరుద్రో దేవతా
ఏక గాయత్రీచ్ఛందః తిస్రోఽనుష్టుభః
తిస్రః పంక్తయః సప్తానుష్టుభౌ ద్వేజగత్యౌ
పరమేష్ఠి ఋషిః శ్రీపరమేశ్వర ప్రీత్యర్థే
శతరుద్రీయే జపాభిషేకే వినియోగః

ఓం అగ్నిహోత్రాత్మనే.... అంగుష్ఠాభ్యాం నమః
ఓం దర్శపూర్ణ మాసాత్మనే.... తర్జనీభ్యాం నమః
ఓం చాతుర్మాస్యాత్మనే.... మధ్యమాభ్యాం నమః
ఓం నిరూఢ పశుబంధాత్మనే.... అనామికాభ్యాం నమః
ఓం జ్యోతిష్టోమాత్మనే ... కనిష్ఠికాభ్యాం నమః
ఓం సర్వక్రత్వాత్మనే.... కరతలకరపృష్ఠాభ్యాం నమః
ఓం అగ్నిహోత్రాత్మనే.... హృదయాయ నమః
ఓం దర్శపూర్ణమాసాత్మనే.... శిరసేస్వాహా
ఓం చాతుర్మాస్యాత్మనే.... శిఖాయై వషట్
ఓం నిరూఢ పశుబంధాత్మనే.... కవచాయహుమ్
ఓం జ్యోతిష్టో మాత్మనే.... నేత్రత్రయాయ వౌషట్
ఓం సర్వక్రత్వాత్మనే.... అస్త్రాయ ఫట్
ఓం భూర్భువస్సువరోమితి దిగ్బంధః

# ధ్యానమ్

ఆపాతాళ నభస్తలాంత భువన బ్రహ్మాండ మావిస్ఫుర
జ్యోతి స్స్ఫాటిక లింగమౌళి విలసత్ పూర్ణేందువాంతామృతైః
అస్తోకాప్లుత మేకమీశమనిశం రుద్రానువాకాన్ జపన్
ధ్యాయే దీప్సిత సిద్ధయే ధ్రువపదం విప్రోఽభిషించేచ్ఛివమ్ !

బ్రహ్మాండ వ్యాప్తదేహా భసిత హిమరుచా భాసమానాభుజంగైః
కంఠే కాలే కపర్దాః కలిత శశికళాశ్చండ కోదండ హస్తాః
త్ర్యక్షా రుద్రాక్షమాలా సులలిత వపుషశ్శాంభవ మూర్తిభేదాః
రుద్రా శ్రీరుద్ర సూక్త ప్రకటిత విభవానః ప్రయచ్ఛంతు సౌఖ్యమ్!

*　　　　　*

ఓం శంచమే మయశ్చమే
ప్రియంచ మేఽనుకామశ్చమే
కామశ్చమే సౌమనసశ్చమే
భద్రంచమే శ్రేయశ్చమే
వస్యశ్చమే యశశ్చమే
భగశ్చమే ద్రవిణంచమే
యంతాచమే ధర్తాచమే
క్షేమశ్చమే ధృతిశ్చమే విశ్వంచ
మే మహశ్చమే
సంవిచ్చమే జ్ఞాత్రంచమే
సూశ్చమే ప్రసూశ్చమే
సీరంచమే లయశ్చమ
ఋతంచమేఽ మృతంచమే
యక్ష్మంచమేఽ నామయశ్చమే
జీవాతుశ్చమే దీర్ఘాయుత్వంచ
మేఽ నమిత్రంచ మేఽ భయంచమే
సుగంచమే శయనంచమే
సూషాచమే సుదినంచమే.

ఓం ఈశాన స్సర్వ విద్యానాం
ఈశ్వర స్సర్వ భూతానాం
బ్రహ్మాధిపతిః బ్రహ్మణోఽధిపతిః బ్రహ్మా
శివో మే అస్తు సదా శివోమ్

వ్యక్తా వ్యక్త గుణేతరం పరతరం షట్త్రింశ తత్త్వాత్మకం
తస్మాదుత్తమ తత్త్వ మక్షర మిదం ధ్యేయం సదా యోగిభిః
ఓం కారాది సమస్త మంత్ర జనకం సూక్ష్మాది సూక్ష్మం పరం
శాంతం పంచమ మీశ్వరస్య వదనం ఖంవ్యాప్తి తేజోమయమ్!

# న మ క ము

## ప్రథమోఽ నువాకః

ఓమ్ నమో భగవతే రుద్రాయ
నమస్తే రుద్ర మన్యవ ఉతోత ఇషవే నమః
నమస్తే అస్తు ధన్వనే బాహుభ్యా ముత తే నమః
యాత ఇషు శ్శివతమా శివం బభూవ తే ధనుః
శివా శరవ్యాయా తవ తయా నో రుద్ర మృడయ
యా తే రుద్ర శివా తనూ రఘోరాఽపాపకాశినీ
తయా న స్తనువా శంతమయా గిరిశం తాభి చాకశీహి
యామిషుం గిరిశ న్త హస్తే బిభర్ష్య స్తవే
శివాం గిరిత్ర తాం కురుమా హిగ్ంసీః పురుషం జగత్
శివేన వచసా త్వా గిరిశాచ్ఛా వదామసి
యథా నః సర్వ మిజ్జగ దయక్ష్మగ్ం సుమనా అసత్
అధ్యవోచ దధి వక్తా ప్రథమో దైవ్యో భిషక్
అహీగ్ంశ్చ సర్వాన్ జంభయ స్సర్వాశ్చ యాతుధాన్యః
అసౌ యస్తామ్రో అరుణ ఉత బభ్రుః సుమంగలః

యే చేమాగ్ం రుద్రా అభితో దిక్షు శ్రితాః
సహస్రశోఽ వైషాగ్ం హేడ ఈమహే
అసౌ యోఽవసర్పతి నీలగ్రీవో విలోహితః
ఉతైనం గోపా అదృశ న్నదృశ న్నుదహార్యః
ఉతైనం విశ్వా భూతాని సదృష్టో మృడయాతి నః
నమో అస్తు నీలగ్రీవాయ సహస్రాక్షాయ మీఢుషే
అథో యే అస్య సత్వానోఽహం తేభ్యోఽకరం నమః
ప్రముంచ ధన్వన స్త్వ ముభయోరా ర్త్ని యోర్జ్యామ్
యాశ్చ తే హ స్త ఇషవః పరాతా భగవో వప
అవతత్య ధను స్త్వగ్ం సహస్రాక్ష శతేషుధే
నిశీర్య శల్యానాం ముఖా శివోనః సుమనాభవ
విజ్యం ధనుః కపర్దినో విశల్యో బాణవాగ్ం ఉత
అనేశ న్నస్యేషవ ఆభురస్య నిషంగథిః
యా తే హేతి ర్మీఢుష్టమ హ స్తే బభూవ తే ధనుః
తయాఽస్మా న్విశ్వ త స్త్వమయక్ష్మయా పరిబ్భుజ
నమ స్తే అస్త్వాయుధాయానాతతాయ ధృష్ణవే
ఉభాభ్యా ముత తే నమో బాహుభ్యాం తవ ధన్వనే
పరితే ధన్వనో హేతి రస్మాన్వృణక్తు విశ్వతః
అథో య ఇషుధి స్తవాఽరే అస్మన్నిధే హితమ్!

## ప్రథమ అనువాకము

ఓం నమస్తే రుద్ర! మన్యవ ఉతోత ఇషవే నమః
ఓం నమస్తే అస్తు ధన్వనే బాహుభ్యా ముత తే నమః

—ప్రథమ ఋక్కు

### పదములు-అర్థములు

హే రుద్రః=ఓ రుద్రా!; తే=నీయొక్క; మన్యవే=క్రోధము కొఱకు; నమః=నమస్సు; అస్తు=అగుగాక!; ఉత=మరియు; తే ఇషవే నమః అస్తు=నీబాణము కొఱకు నమస్కారము; తే ధన్వనే నమః అస్తు=నీధనువునకు నమస్కారము; ఉత=మరియు; తే బాహుభ్యామ్ నమః అస్తు=నీ బాహువులకు నమస్కారము.

మహానుభావా! రుద్రదేవా! భద్రమూర్తీ! నిన్ను చూచి వైరిబలం రోదిస్తోంది. అంధకాసురులైన అరిషడ్వర్గాలపై నీవు ప్రదర్శించే ఆగ్రహానికి అరులంతా హడలి పోతున్నారు. మా దుఃఖం పోతోంది. నీ ఆగ్రహానికి అభివందనాలు. నీ ఆయుధోపేత హస్త పద్మాలకు అనేక నమస్కారాలు. నీ బాణాలు అన్నీ అరి సమూహంపై ఫలించుగాక! వైరులు నిహతులగుగాక! లోకం సుఖించు గాక! నీకు నమస్సులు!

*　　　*

క్రోధం బితరులకు తపో
బాధక మగు గాని నీ తపంబున కది యు
ద్బోధకము సలిల మగ్నికి
బాధకమై వైద్యుతాగ్ని ప్రభవించు గతిన్

—భావవిలాసము

**ఓం యాత ఇషు శ్శివతమా శివం బభూవ తే ధనుః**
**శివా శరవ్యా యా తవ తయా నో రుద్ర! మృడయ**

—ద్వితీయ ఋక్కు

హే రుద్రః = ఓ రుద్ర!; తే = నీదైన; యా ఇషుః = ఏ బాణము; శివతమా = మిక్కిలి శివతమము; బభూవ = అయినదో; తే యత్ ధనుః = నీ యొక్క ఏ ధనువు; శివం బభూవ = శాంతమైనదో; తవయా శరవ్యా = నీ ఏ అమ్ములపొది; శివా = మంగళమైనదో; తయా = వానిచేతను; తేన = ధనుస్సు చేతను; తయా = ఆ అమ్ములపొది చేతను; నః = మమ్ము; మృడయ = సుఖపెట్టుము.

ఓ రుద్ర దేవా! నీ బాణాలు శాంతి కరాలు. నీ ధనువు శాంతిప్రదం. నీ అంబుల పొది అతి శాంతిప్రదాత. శివా! అవి శివంకరాలు. నీ శాంత బాణమూ నీ శాంత బాణాసనమూ నీ శాంత నిషంగమూ అన్నీ మంగళప్రదాలు. అవి మాకూ మాలోకానికీ శాంతిశ్రీ దివ్యసౌఖ్యాలు ప్రతిపాదించు గాక!

**ఓం యా తే రుద్ర! శివా తనూ రఘోరా పాపకాశినీ!**
**తయా న స్తనువా శంతమయా గిరిశంతాభి చాకశీహి**

—తృతీయ ఋక్కు

హే గిరిశంతః = హే కైలాసవాసా! సర్వసుఖ ప్రదాతా!; హే రుద్రః = ఓ రుద్రదేవా!; తే యా తానూః = నీ ఏతనువు; శివా = శివము శాంతము; అఘోరా = హింసించనిది; అపాపకాశినీ = పాపప్రకాశములేనిది; తయా శంతమయా = శాంతమైనదో; తనువా = ఆ తనువు చేత; నః = మమ్ము; అభి = అభిలషించి; చాకశీహి = ప్రకాశింపచేయుము;

ఓ రుద్రదేవా! కైలాసవాసా! శంకరా. గిరీశా! మహేశా! సాయీశా! నీ తనువు శివంకరము. శాంతిదము అది అఘోరము. అహింసాకరము. అది శివ ప్రకాశిని. అపాపకాశిని. నీ శాంత సుందర శరీరం సత్యం శివం. శివా! నీవు మమ్ము అపేక్షించి అభిలషించి ఆశీర్వదించి సుఖపెట్టుదువు గాక!

"రుద్రో వా ఏష యదగ్నిః" అని శ్రుతి. రుద్రుడు అగ్నిమూర్తి. ఈశ్వర శరీరం ఆగ్రహం అనుగ్రహం కలది. ఆగ్రహ శరీరంతో దుష్టదహనం జరుగుతుంది. అనుగ్రహ శరీరంతో లోకరక్షణ భక్త అభీష్ట సిద్ధి జరిగిపోతుంది. ఇది లోకక్షేమకరవిధానం.

ఓం యా మిషుం గిరిశంత ! హస్తే బిభర్ష్య స్తవే
శివాం గిరిత్ర తాం కురు మా హిగ్ంసీః పురుషం జగత్!

— చతుర్థ ఋక్

హే గిరిశంతః=కైలాసవాసివగుశివా!; యామ్ ఇషుమ్=ఏ బాణమును; అస్తవే=శాత్రవులపై ఉపయోగించుటకై; హస్తే బిభర్షి=చేతిలో పూనితివో; హే గిరిత్ర!=కైలాసపాలకా!; తామ్=దానిని; శివాం కురు=మాయందు శివంకరము చేయుము; పురుషమ్=మా స్త్రీ పురుషులను; జగత్=మా పశువులను; మా హింసీః=రక్షించుము.

ఓ శాంతా! దయాకరా! శంకరా! అరిభయంకరా! సర్వ శుభంకరా! అరి భీకరాలూ శత్రు సంహారకాలూ అయిన నీ చేతి బాణాయుధాలు మాకు సర్వదా మంగళకరాలగు గాక! ఈ లోకానికి నిత్యం సత్యం శివం సుందరం శాంతం కలిగించుగాక! అవి మాకు అహింసాకరములగు గాక! అవి శాంతి ప్రదాలు అగుగాక! సర్వత్రా! గిరిత్రా! పరమ పవిత్రా! త్రినేత్రా! నమోవాకాలు.

*   *

భాసుర లీల గాంచిరి సుపర్వులు భక్త జనైక మానసో
ల్లాసము కిన్నరీ జన విలాసము నిత్య విభూతి మంగళా
వాసము సిద్ధ గుహ్యక నివాసము రాజత భూ వికాసి కై
లాసము కాంతి నిర్జిత కుల క్షితిభృత్ సుమహద్విలాసమున్

-పోతన

ఓం శివేన వచసా త్వా గిరిశాచ్ఛా వదామసి
యథా నస్సర్వ మిజ్జగ దయక్ష్మగ్ం సుమనా అసత్

— పంచమ ఋక్

హే గిరిశ = హే కైలాసపతీ!; త్వా అచ్ఛా = నిన్ను పొందుటకు; శి
వచసా వదామసి = మంగళస్తుతి వాక్సుధలచే ప్రార్థిస్తున్నాను; యథా = ఏ విధము
నైతే; నః = మా యొక్క; సర్వమ్ ఇత్ జగత్ = మనుష్యులు మా పశుబలు
అయక్ష్మమ్ = రోగరహితంగా; సుమనా = సౌమనస్యంగా; అసత్ = అగునో; తథా =
విధముగా; కురు = చేయుము.

ఓ రాజ గిరీశా! సాయీశా! కైలాసవాసా! నీ సాయుజ్యం జేరుటకు శు
కరమైన వాక్కులచేత ప్రార్థిస్తున్నాను మా సర్వ జగత్తు రోగ రహితమూ సౌ
నస్య భరితమూ అగుగాక! అందుకు తగినట్లు మా లోకమును సుశిక్షితమ
చేయుదువుగాక!

* *

నీలకంఠుని శిరస్సుపై నీళ్ళుచల్లి
పత్తి రిసుమంత నెవ్వడు పారవైచు
కామధేనువు వానింటి గాడి పసర
మల్ల సురశాఖి వానింటి మల్లెచెట్టు!

— మల్లి

ఓం అధ్యవో చ దధివక్తా ప్రథమో దైవ్యో భిషక్
అహీగ్ం శ్చసర్వాన్ జంభయన్త్సర్వాశ్చ యాతుధాన్య

— షష్ఠ ఋక్కు

ప్రథమః = సర్వ ప్రథముడు; దైవ్య = పరిపాలనాసక్తుడు; అధివక్తా =
గొప్పవక్త అయిన; యః = ఏ రుద్ర దేవుడున్నాడో ఆ స్వామి; అధ్యవోచత్ =

నన్ను గూర్చి పలుకునుగాక !; తదానీమేవ = అప్పుడే; మయ సర్వాధిక్యం = నాకు సర్వాధిక్యము: సిధ్యతి = సిద్ధించుచున్నది; భిషక్ = ఆస్వామి చికిత్సకుడు; సర్వాన్ అహీన్ చ = సర్వసర్ప వ్యాఘ్రాదులను: సర్వాః యాతుధాన్యః చ = సర్వరాక్షసులను: జంభయన్ = నశింపచేయుగాక !

రుద్రుడు అధివక్త. అతడు ప్రథముడు. ఆ శివుడు దైవ పరిపాలకుడు. మహేశ్వరుడు భవరోగ భిషగ్వరుడు. హరుడు సర్పవ్యాఘ్రరాక్షస క్రూర శక్తులను సర్వనాశనం చేస్తుంటాడు. ఆ స్వామి నన్ను గూర్చి 'ఇతడు మంచివాడు అధికుడు' అని తన భక్తుల యెదుట పలికిన నాకు ధన్యత్వ సిద్ధి

ఆ సదాశివుడు సర్వశుభంకరుడు. రుద్రధ్యానం సర్వరోగోపశమనం. సర్పభూషణుని సంస్మరణం సర్వ విషహరణం. సర్వజ్ఞ సంస్తుతి సర్వరాక్షస భయ దూరం. భవానీపతి భక్తవాత్సల్యం అపారం.

**ఓం అసౌ యస్తామ్రో అరుణ ఉత బభ్రు స్సుమంగలః**
**యే చేమాగ్ం రుద్రా అభితో దిక్షు శ్రితాస్సహస్ర**
**శోఽవైషాగ్ం హేడ ఈమహే**

— సప్తమ ఋక్కు

యః అస్తి సః = ఏ రుద్రుడు కలడో ఆ రుద్రుడు: తామ్రః అరుణః = మిక్కిలి రక్తవర్ణుడు; ఉతః = మరియు; బభ్రుః = పింగళుడు; సుమంగలః = సుమంగళుడు; అసౌ = ఈ ఆదిత్యమూర్తి; యే చ యే రుద్రాః = మరి ఏ రుద్రులో వారు; అభితః = ఈ భూమి, దిక్షుశ్రితాః = దిశలందున్నారో; తేచ = ఆ రశ్మిరుద్రులు; సహస్రశః = వేలాదులు; ఏషాం = ఆ రుద్రరశ్మిమూర్తుల యొక్క; హేడః = క్రోధతీక్ష్ణత; అవేమహే = నమస్తులతో నివారించుచున్నాము.

రుద్రుడు ఆదిత్య సత్యరూపుడు. బ్రహ్మాండమండల ప్రభాకరుడు. ఆ ఉదయ భానుడు తామ్రవర్ణుడు. మరికొంత సేపటికి ఆ రుద్రమూర్తి అరుణారుణ మూర్తిత్వం దాలుస్తాడు.

మరి కొంత సేపటిలో ఆ మహేశ్వర రవి పింగళవర్ణ శోభలతో పసుపు కుంకుమల సొబగులు కుమ్మరిస్తాడు. నానా వర్ణుడు. సువర్ణుడు. అన్ని రూపాలు ఆ స్వామివే. ఆయాకాలాలలో ఆయా రూపాలు పొంది ఆనందం అందిస్తాడు. ఆ అష్టమూర్తి భానుడు, సుమంగళుడు. సర్వమంగళాధిపుడు. సర్వశుభంకరుడు. ఈ ఆది శంకరుడే ఆదిత్యుడు. అంధకాంతకుడు.

ఆ ఆదిత్య శంభుడు సహస్రాధిక రుద్రరశ్మి స్వరూపుడు. ఆ సూర్య కిరణాలే రుద్రులు. ఆ రుద్రరూపకిరణాలే సూర్యకిరణాలు. అవి సర్వదిశల వ్యాప్తి చెంది ఉంటాయి. ఆ సహస్ర రుద్ర ఆదిత్య కిరణాలకు తీక్షణతర ఆసదృశ తేజస్సులకు సహస్ర నమస్సులు. ఆ తాపం ఆ కోపం శమించు గాక! అవనికి అనుగ్రహం అందించుగాక !

*  *

శాంత మనోజ్ఞమై అరుణ సారథికంబగు - ఏకచక్ర వి
క్రాంతము - సప్త సప్తి రుచిరంబగు స్యందన మెక్కి - స్వర్గసం
క్రాంతులతో - సహస్రకర కాంతులతో - భువనత్రయిన్ ప్రభా
వంత మొనర్చు సూర్య భగవానుడు మాకు శుభంబు లిచ్చుతన్

— కరుణశ్రీ

ఓం అసౌ యోఽవసర్పతి నీలగ్రీవో విలోహితః
ఉతైనం గోపా అదృశన్నదృశ న్నుదహార్యః
ఉతైనం విశ్వాభూతాని సదృష్టో మృడయాతినః

— అష్టమ ఋక్కు

యః నీలగ్రీవః = ఎవడు నీలగ్రీవుడై ఉన్నాడో అతడు; విలోహితః అసౌ అవసర్పతి = ఎర్రనివాడై మండలవర్తియై ఉదయాస్తమయాలను కలిగిస్తున్నాడు; ఉత = మరియు; ఏనమ్ = ఈ ఆదిత్యరుద్రుని; గోపాః అదృశన్ = గోపాలురు చూచుచున్నారు; ఉదహార్యః అదృశ్యన్ = నీళ్ళు తెచ్చుకొనేస్త్రీలు చూచుచున్నారు; ఉత = మరి ఇంకను; ఏనమ్ = ఈ ఆదిత్య శివుని; విశ్వాని భూతాని పశ్యంతి

= సర్వప్రాణులు చూచుచున్నాయి; సఃదృష్టః = చూడబడిన ఆ రుద్రుడు; నః మృడ యాతి = మమ్ము సుఖవంతులను చేయుగాక !;

శివమూర్తి భద్రప్రదుడు. లోకక్షేమం కోసం కాకోలం పానం చేసి నీలగ్రీవు డైనాడు, అంతకు మునుపు శితికంఠుడే. విరూపాక్షుడు విలోహితుడు. మిక్కిలి ఎర్రనివాడు. అందమైనవాడు. ఆ స్వామి దయతో ఆకాశ మండలవర్తియై ఉదయాస్తమయాలు కలిగిస్తున్నాడు.

ఆదిత్య శంకరమూర్తిని పశుపాలకులైన గోపాలురు దర్శిస్తున్నారు. ఆ రవిని నీళ్ళ కడవలు తీసుకొని వెళ్ళే వెలదులూ చూస్తున్నారు. ఆ సూర్యదేవుని విశ్వంలోని సర్వజనులు సర్వ ప్రాణులూ కనులారా కాంచుతున్నారు. సర్వదర్శనీయుడైన సహస్రభానుడైన సదాశివుడు మాకు పరమ సుఖం ప్రసాదించుగాక !

ఓం నమో అస్తు నీలగ్రీవాయ సహస్రాక్షాయ మీఢుషే
అథో యే అస్య సత్వానోఽహం తేభ్యోఽకరం నమః

— నవమ ఋక్కు

నీలగ్రీవాయ = నీలగ్రీవుడు; సహస్రాక్షాయ = వేయికనులతో జగమును రక్షించు ఇంద్రుడు; మీఢుషే = పర్జన్యుడును అయిన రుద్రుని కొరకు; నమః = నమస్కారము; అస్తుఅగుగాక !; అథో = మరియు; అస్య = ఈ రుద్రునకు; యే సత్వానః = ఏ భృత్యప్రాణులు; సంతి = కలరో; తేభ్యః = వారికొరకు; అహమ్ = నేను; నమః = నమస్కారము; అకరమ్ = చేస్తున్నాను.

లోక క్షేమం కోరి కాకోలం పానం జేసిన నీలగ్రీవుడు సహస్ర విధాల సురలను చూస్తున్న సహస్రాక్షుడు - ఇంద్రుడు, లోకానికి జలాధారుడైన పర్జన్యుడు అయిన రుద్రదేవునకు నమస్కారం. ఆ రుద్ర స్వామికి భృత్యులుగా గల సర్వ ప్రాణి కోటికి నేను తలవంచి ప్రణమిల్లుతున్నాను.

సర్వ ప్రాణులు సర్వేశ్వర భృత్యులే. ప్రాణులందరు పరమేశ్వర అంశగలవారే. అందరూ వందనీయులే. ఇంద్రుడు ఇంద్రియాధిపతి. సర్వేంద్రియాలు సర్వ

నేత్రాలు ఇంద్రియ స్వాధీనం. అతడు మహేంద్రుడు మహేశ్వరుడు. సర్వాకాంక్షా ఫలాలను సహస్రవిధాల నెరవేరుస్తుంటాడు. పర్జన్యుని వలె ఈప్సితాల వర్షం కురిపిస్తాడు.

* *

గిరీశం గణేశం గళే నీలవర్ణం
గజేంద్రాధిరూఢం గుణాతీతరూపమ్
భవం భాస్వరం భస్మనా భూషితాంగం
భవానీ కళత్రం భజే పంచవక్త్రమ్

— వేదసారశివస్తోత్రం

**ఓం ప్రముంచ ధన్వనస్త్వ ముభయో రార్త్ని యోర్జ్యామ్**
**యా శ్చ తే హస్త ఇషవః పరాతా భగవో వప**

- దశమ ఋక్కు

హే భగవః = ఓ భగవాన్; త్వమ్ ధన్వనః = నీవు నీ ధనువుకు; ఆర్త్నియోః జ్యామ్ = అంచుల గల అల్లెత్రాటిని; ప్రముంచ = దింపుము; చ = మరియు; తే హస్తే = నీ చేతులలో; యా ఇషవః = ఏ బాణాలున్నాయో; తాః = ఆ బాణాలను; పరావప = పరిత్యజింపుము.

ఓ భగవాన్! మహేశ్వరా! ఐశ్వర్య సంపన్నా! రుద్రా! నీవు నీ మహాప్రళయంకర ధనువుకు గల అల్లత్రాటిని క్రిందికి దింపుము తండ్రీ! నీ చేతిలోని బాణాలను పరిత్యజింపుము స్వామీ! నమస్కారం.

* *

నమస్తే నమస్తే విభో విశ్వనాథ!
నమస్తే నమస్తే చిదానంద మూర్తే
నమస్తే నమస్తే తపోయోగ గమ్య
నమస్తే నమస్తే శ్రుతిజ్ఞాన గమ్య!

- వేదసార శివస్తోత్రం

**ఓం అవతత్య ధను స్త్వగ్ం సహస్రాక్ష శతేషుధే**
**నిశీర్య శల్యానాం ముఖా శివో నః సుమనా భవ**

— ఏకాదశ ఋక్కు

హే సహస్రాక్ష=ఓ సహస్ర నేత్ర శివా!; హే శతేషుధే=శతాధికమైన అంబుల పొదులు గలవాడా!; త్వమ్‌ధనుః అవతత్య=నీవు ధనువును దింపి; శల్యా నామ్=బాణముల; ముఖాని=వాడి మొనలను; నిశీర్య=శీర్ణము సడలించుము స్వామీ అలాచేసి; సుమనాః=మమ్ము గూర్చి; శివః=శాంతుడవు; భవ=ఆగుము.

ఓ సర్వేశ్వరా! సహస్రాక్షా! సర్వదైవాధినాథా! నీ ధనువుకు గల అల్లె త్రాటిని ఉపసంహరింపు దేవా! నీ నిశితాగ్ర భాగాలు గల అమ్ములను అధో ముఖం చేయి స్వామీ! శివా! శివంకరా! శాంతి వహించు శంకరా! మా యందు అనుగ్రహం కలిగి ఆశీర్వదించు. చల్లని మనస్సుతో ఎల్లవారిని కటాక్షించు తండ్రీ! దండ ప్రణామాలు.

*　　　　*

"పాహి పాహి ప్రభో! ప్రభో! పాహి" యనెడి
సురల ఆర్తధ్వనుల్ మింట సుళ్ళు తిరిగె-

— కరుణశ్రీ

**ఓం విజ్యం ధనుః కపర్దినో విశల్యో బాణవాగ్ం ఉత**
**అనేశన్న స్యేషవ ఆభురస్య నిషంగధిః**

— ద్వాదశ ఋక్కు

కపర్దినశః=వుని; ధనుః=ధనున్సు; విజ్యమ్=నారి లేనిది; అస్తు=అగుగాక; బాణవాన్=అంబుల పొది; విశల్యః=బహిర్భూతములు; అస్తు=కాకుండుగాక!; ఉత=మరియు; అస్య ఇషవ=తః రుద్రుని బాణాలు; అనేశన్ భవంతు=ఛేధింపనివి అగుగాక!; అస్య నిషంగధిః=తః రుద్రుని తూణీరము; ఆభుః భవతు=కొంచము సమర్థ మగుగాక!;

రుద్రా! ఇంతవరకు దుష్ట సంహారం చేశావు. అరులు అణగి పోయారు, ఇక

ఆగ్రహం చెందనలదు. శాంతించు! శాంతించు! శాంతి ప్రసాదించు! యుద్ధ వేషం చాలించు. మమ్ము చక్కగా పాలించు. శతప్రణామాలు.

కపర్ది ధనువు అల్లెత్రాడు సడలించి విశ్రాంతి పొందుగాక! మహాదేవుని తూణీరంలోని బాణాలు అధోముఖాలు అగుగాక! ఉగ్రదేవుని అంబులు ఎవరినీ బాధింపకుండుగాక! శంకర స్వామి అందరికీ శాంతి సంపద ప్రసాదించుగాక! సర్వేజనాః సుఖినోభవంతు!

*  *

ఓంకార-గాండివ-జ్యా
టంకారంబులు నభః కటాహము నిండెన్
శంకర కవికేతు భుజా
హంకారా నిరంకుశాహ వాంగణ భూన్

— హరవిలాసము

**ఓం యా తే హేతి ర్మీఢుష్టమ హస్తే బభూవ తే ధనుః**
**తయాఽస్మాన్ విశ్వత స్త్వ మయక్ష్మయా పరిబ్భుజ**

— త్రయోదశ ఋక్కు

హే మీఢుష్టమ = కోరికలు వర్షించు శివా! ఈప్సిదా!; యా హేతి = ఏ ఖడ్గము; తే బభూవ = నీది ఉండెనో; యత్ ధనుః = ఏ ధనువు; తే బభూవ = నీది ఉండెనో; అయక్ష్మయా = ఉపద్రవాలు చేయని; తయా = ఆ హేతి ధనువులచేత కరుణతో; త్వమ్ అస్మాన్ పరిబ్భుజ = నీవు మమ్ము పాలింపుము.

మితిమీరిన అభీష్ట సంపదలు అభివర్షించు స్వామీ! సాంబశివా! సత్య సాయీశ్వరా! ఇష్టప్రదా! ఉపద్రవాలు చేయని నీ ధనుస్సు ఖడ్గము మొదలైన ఆయుధాలు మమ్ము రక్షించుగాక! భువనమును పరిపాలించుగాక! నీ ఆయుధాలు శాంతి కాలములో మంగళములు ప్రసాదించుగాక!

**ఓం నమస్తే అస్త్వాయుధాయా నాతతాయ ధృష్ణవే**
**ఉభాభ్యాముతతే నమో బాహుభ్యాం తవ ధన్వనే**

— చతుర్దశ ఋక్కు

హే రుద్ర=ఓ రుద్ర దేవా!; అనాతతాయ=అప్రసారితమైన; ధృష్ణవే=ప్రహరణ సమర్థమైన; తే ఆయుధాయ=నీ ఆయుధాల కొరకు; నమః అస్తు=నమస్కారమగుగాక! ఉత=మరియు తే ఉభాభ్యాం బాహుభ్యామ్=నీ రెండు బాహువులకు తవ ధన్వనే=నీ ధనువు కొరకు నమః అస్తు= నమస్కారము అగుగాక!

ఓ రుద్ర మూర్తీ! శత సహస్ర వైరి ప్రహార సమర్థమైన నీ ఆయుధం శాంతించినందుకు నమోవాకాలు. బలకరమైన నీ బాహుద్వయానికి నిత్యమంగళ నీరాజనాలు. నీలకంఠా! నిత్య నిర్మల కాంతులు వర్షించు నీ ధర్మ ధనుస్సుకు నమస్సులు.

**ఓం పరితే ధన్వనో హేతి రస్మాన్ వృణక్తు విశ్వతః**
**అథో య ఇషుధి స్తవారే అస్మన్నిధే హితమ్**

—పంచదశ ఋక్కు

హే రుద్ర = ఓ రుద్రమూర్తీ! తే ధన్వనః= నీ ధనస్సంబంధితమైన; హేతిః = ఖడ్గము; విశ్వతః = విశ్వము మొత్తమును; అస్మాన్ః =మమ్ము ను పరివృణక్తు=విడిచిపెట్టు గాక! అథో=మరియు; తవయఃఇషుధిః=నీదైన ఏ బాణాలతూణీరము అస్తి=కలదో; తమ్ అస్మత్=ఆ పొదిని మానుండి; దూరే నిధేహి= దూరముగా ఉంచుము.

ఓ రుద్రదేవా! మహానుభావా! విశ్వవ్యాప్తమైన నీ ధనుర్బాణాద్యాయుధాలు ఏ ఒక్కటి కూడా మాకు తగలకుండా పోవు గాక! నీ తూణీరం కూడా మాకు దూరంగా వైరులపైపుగా ఉండుగాక! సదాశివా! భవా!మాకు నీవు దయాశంకరుడవై ప్రసన్న వదనంతో దర్శనం ఇచ్చి చల్లగా రక్షించెదవు గాక! నమస్సహస్రాలు.

* *

ఆవాడన్ తిరుగాడ నేటికి హరా! ఆ మానసమౌ నీకు నా
దౌ డెందంపుటరణ్య మున్నదిట నీ వాత్సల్య మందిర వే
టాడన్ వచ్చును క్రూర జంతువుల ఈర్ష్యారోష కామాదులన్
రేడా! ఆదికిరాత! విభూ! మృగధారీ! బాలకోటీశ్వరా!

—కరుణశ్రీ

## ద్వితీయోఽనువాకః

ఓమ్ నమో హిరణ్యబాహవే సేనాన్యే
దిశాంచ పతయే నమః
నమో వృక్షేభ్యో హరికేశేభ్యః పశూనాంపతయే నమః
నమః సస్పింజరాయ త్విషీమతే పథీనాంపతయే నమః
నమో బభ్లుశాయ వివ్యాధినేఽన్నానాం పతయే నమః
నమో హరికేశాయోపవీతినే పుష్టానాంపతయే నమః
నమో భవస్య హేత్యై జగతాం పతయే నమః
నమో రుద్రయాఽఽతతావినే క్షేత్రాణాం పతయే నమః
నమః సూతాయాఽహన్త్యాయ వనానాం పతయే నమః
నమో రోహితాయ స్థపతయే వృక్షాణాం పతయే నమః
నమో మన్త్రిణే వాణిజాయ కక్షాణాం పతయే నమః
నమో భువన్తయే వారివస్కృతా యౌషధీనాం పతయే నమః
నమః ఉచ్చైర్ఘోషాయాఽఽక్రన్దయతే పత్తీనాం పతయే నమః
నమః కృత్స్నవీతాయ ధావతే సత్వానాం పతయే నమః

## ద్వితీయ అనువాకము

ఓం నమో హిరణ్య బాహవే సేనాన్యే
దిశాం చ పతయే నమః

—ప్రథమ యజుస్సు

హిరణ్యబాహవే=హిరణ్యబాహువులు గల; సేనాన్యే=సేనాగ్రగామిఅయిన రుద్రునికొరకు; నమఃఅస్తు=నమస్కారము; చ=మరియు దిశామ్ = దిక్కులకు; పతయే=పాలకుడైన శివుని కొరకు; నమఃఅస్తు=నమస్కారము అగుగాక!

మహా రుద్రదేవుని బాహువులు బంగారు ఆభూషణ భూషితములు. సుందరములు. సౌఖ్యదములు. ఆ రుద్రదేవుడు ఘోర సంగ్రామ రంగమందు తన సైన్య సమూహానికి మహా శక్త్యుత్సాహాలనిచ్చి ముందుకు నడిపిస్తాడు. ఆ యుద్ధ వీరాధిపునకు అభివందనం. ఆ మహాదేవుడు అష్టదిక్కులకు అధిపతి. దశదిశలకు దక్షుడైన సత్పరిపాలకుడు. ఆ రుద్రదేవునకు ప్రణామాలు.

* *

భూతాధారుడవై-మహాధ్వరకళా పూజ్యుండవై-యాగమ
వ్రాతస్తుత్యుడవై -సురార్చితుడవై -బ్రహ్మణ్య దేవుండవై
శ్రౌత స్మార్త శుభక్రియాధిపతివై-శాంతాంతరంగోజ్జ్వల
జ్యోతీరూపుడవై వెలుంగు నిను సంస్తోత్రంబొనర్తున్ శివా।

—మారన

**ఓం నమో వృక్షేభ్యో హరికేశేభ్యః**
**పశూనాం పతయే నమః**

—ద్వితీయ యజుస్సు

హరికేశేభ్యః = హరితపర్ణ కేశములు గల; వృక్షేభ్యః = వృక్షాకార రుద్రమూర్తుల కొరకు; నమఃఅస్తు=నమస్కారము; పశూనామ్ = పశువులగు జీవులకు; పతయే=పాలకుడైన శివమూర్తికొరకు; నమఃఅస్తు నమస్సు అగుగాక.

ఉన్నత వ్యోమకేశుని కేశాలు సుందర మందార హరితవర్ణాలు. అవి సౌవర్ణపర్ణాలు. కైలాస స్వామి కల్పవృక్షం. అశ్వత్థ వృక్షం. మందార వృక్షం. వట వృక్షం. అందమైన ఆకాశాన్ని చుంబించే ప్రతి వృక్షమూ శంకర స్వామియే. ఆ వృక్షాల పత్రాలన్నీ శివకేశాలే. ఆ స్వామికి సాష్టాంగ నమస్కారం. ఆ పరమ

శివుడు పశుపతి. జీవులన్నీ పశువులే. శివుడు జీవకోటికి అధినాథుడు. అత్యంత దయా హృదయుడైన పరిపాలకుడు. అట్టి వృషభ వాహనునకు నమస్సులు.

## ఓం నమస్సస్పింజరాయ త్విషీమతే పథీనాం పతయే నమః

— తృతీయ యజుస్సు

సస్పింజరాయ=పచ్చిక లేత చిగురుల వంటి పింజర వర్ణుడు; త్విషీమతే = దీప్తిమంతుడగు రుద్రుని కొరకు; నమఃఅస్తు=నమస్కారము; పథీనామ్ = శాస్త్ర మార్గములకు; పతయే = పాలకుడగు శివుని కొరకు; నమఃఅస్తు = నమస్కారము; అగు గాక !

గిరీశుడు హరికేశుడు. హరితవర్ణ కేశుడు మాత్రమే కాక హరితవర్ణ దేహుడు. నానా వర్ణుడు. కిమ్మీర దేహుడు. మనోహరుడు. ఆకుపచ్చని అందాల వాడు. లేత గరిక వంటి పింజర వర్ణ శరీరుడు. పచ్చనివాడు. నిత్య కల్యాణం పచ్చని తోరణం వంటివాడు. సర్వ మంగళుడు. అందుకని ఆ స్వామికి సస్పింజరుడు అని పేరు వచ్చింది.

పార్వతీ పతి త్విషాంపతి. త్విషీమతి. బహుదీప్తిమంతుడు. విస్తృత తేజశ్శాలి. ఆ మహా వర్చస్వికి నమో వాకాలు. సూర్యుని కంటే అధిక తేజశ్శాలి. సూర్యుడికి కాంతిదాత పరమేశ్వరుడు. శాస్త్రోక్త దక్షిణోత్తర మార్గదర్శి. మార్గ పరిపాలకుడు. ఆయా పథాలకు అధిపతి. వేద మార్గానికి ప్రవర్తకుడు. ప్రచారకుడు — ప్రబోధకుడు ప్రభాకరుడు. అట్టి ధర్మ మార్గ ప్రభామూర్తికి ప్రణామాలు.

## ఓం నమో బభ్లుశాయ వివ్యాధినేఽన్నానాం పతయే నమః

— చతుర్థ యజుస్సు

బభ్లుశాయ=వృషభ వాహనునకు, వివ్యాధినే = విద్వేష బాధితునకు, నమః అస్తు=నమస్కారము, అన్నానామ్= వివిధ అన్నములకు, పతయే= పాలకుడైన అధిపతి అయి, నమః అస్తు=రుద్రుని కొరకు నతి.

పరమేశ్వరుడు వృషభ వాహనుడు. వృష కేతనుడు. వృషభ విహారుడు. నంది నాగభూషణుడి పాద పద్మాలను అభినందిస్తూంటుంది. నందీశ్వర ఉచ్ఛ్వాసనిశ్వాసాలతో నగజా మనోహరుడు తూగు టుయ్యాల లూగుతాడు. భక్తులు వృషభ అనుజ్ఞ తోనే ఈశ్వరార్చన కావిస్తారు. అట్టి వృష ధ్వజుడు విద్వేషులను విశేషంగా వేధిస్తాడు. విరోధులను విస్తారంగా బాధిస్తాడు. నాశనం చేస్తాడు అట్టి అంధకరిపునకు అభివందనాలు.

అన్నపూర్ణా మనోహరుడు అన్నములకు అధిపతి. అన్నదాత. అఖిల జీవులకు ఆహారం పెట్టి ఆనందం కలుగజేస్తాడు. లోకంలో అందరు అన్నగత ప్రాణులు కదా! అందుచే అంబికాపతి అన్నపాలకుడు. ఆ స్వామికి జేజేలు.

ఓం నమో హరికేశా యోపవీతినే పుష్టానాం పతయే నమః

— పంచమ యజుస్సు

హరికేశాయ=వినీలకేశుడు, ఉపవీతినే=యజ్ఞోపవీతధారి అగు రుద్రుని కొరకు, నమఃఅస్తు=నమస్కారము, పుష్టానామ్ = పూర్ణ గుణ పురుషులకు, పతయే= పాలకుడగు శివుని కొరకు, నమఃఅస్తు=వందనము.

హర కేశములు హరికేశములు. అవి నీల కేశములు. ఆ కుంతలములు సుదీర్ఘములు. అవి అతి కోమలములు. అవి మెరుగుటందములు చిందుతుంటాయి. ఆ నిగనిగలాడు నీల కుంతలాలు దేవ జాతి సౌందర్య భరితాలు. రమణీయ రక్షః కవచాలు. శివంకరాలు. అవి సర్వమంగళ హస్త సంవారిత ప్రవర్ధనాలు. నీల కంఠుడు నీల మూర్ధజుడు.

వామదేవుడు వటువు. హరికేశుడు యజ్ఞోపవీతధారి. యజ్ఞోపవీతము మంగళార్థ సూచకము. స్వామి సర్వ మంగళకరుడు. పరమ పవిత్ర ఉపవీతం బ్రహ్మచారియైన బాల శివునకు బహు మూల్య ఆభరణం. ఈ యజ్ఞోపవీతధారియైన పరమ శివుని చూచి పార్వతి పరవశించింది. ఆ స్వామికి శత వందనాలు.

శివుడు పరిపూర్ణ గుణ భూషణుడు. ఆత్మకు పుష్టి తుష్టి గుణములిచ్చుటలో అనుపమానుడు. అద్వితీయుడు-దయామయుడు. పుష్టికరగుణాలకు అధిపతి. అట్టి పరిపాలకునకు ప్రణతులు.

*  *

బంగరు పట్టు గోచి- నును పచ్చని ముంజియ- ఒంటి జందెమున్
ముంగయి కంకణంబు- జిగి మోహన హారము- మండల ప్రభా
భంగ కపోలముల్- తరుణ భాను సమాన ముఖాంబుజంబు మీ
రంగ వటు క్రియన్ శివుడు రాడు కదా! నను చింత దీర్పగన్

—పుష్పగిరి తిమ్మన

## ఓం నమో భవస్య హేత్యై జగతాం పతయే నమః

— షష్ఠ యజుస్సు

భవస్య=సంసార మాయాజాలమునకు; హేత్యై=ఖడ్గమైన రుద్రదేవుని కొఱకు; నమః అస్తు=నమస్కారము; జగతామ్=మూడు లోకాలకు; పతయే=పతి అయిన శివుని కొఱకు; నమః అస్తు=నమోవాకము.

రుద్రుడు హేతి హస్తుడు. ఖడ్గధారి ఖండ పరశువు. ఈశ్వర హేతి శుభ పదం. త్రిలోచనుడు భవబంధాలు త్రెంచి వేస్తాడు. సర్వజ్ఞుడు సంసార మాయా: మోహ పాశాలను ఖడ్గంతో ఖండిస్తాడు. ఆయన జగత్పతి.

## ఓం నమో రుద్రాయాఽఽతతావినే క్షేత్రాణాం పతయే నమః

— సప్తమ యజుస్సు

ఆతతావినే=పెద్ద పినాకముచే రక్షించు; రుద్రాయ=రుద్రదేవుని కొఱకు నమః అస్తు=నమస్కారము; క్షేత్రాణామ్=వివిధ క్షేత్రములకు; పతయే=అధిపతి అయిన శివుని కొఱకు; నమః అస్తు=వందనము.

రుద్రుడు పినాకపాణి. ఆయన తన విశేషమైన ధనువుచేత లోకాలను రక్షిస్తుంటాడు. అట్టి రుద్రదేవునకు నమస్కారాలు. రుద్రదేవుడు సర్వక్షేత్ర పాలకుడు. సర్వజ్ఞుడు సర్వక్షేత్రజ్ఞుడు. క్షేత్రాక్షేత్రాలనెఱిగి జ్ఞాన సంపద పండించటంలో శంకరుడు మహా నిపుణుడు. అట్టి క్షేత్రపతికి అభివాదాలు.

**ఓం నమః సూతాయాఽహంత్యాయ వనానాం పతయే నమః**

— అష్టమ యజుస్సు

సూతాయ = సనాతన సారథికి; అహంత్యాయ = అభేద్యుడు అజేయుడు అయిన; నమః అస్తు = రుద్రుని కొఱకు నమస్కారము; వనానామ్ = వివిధ వనాలకు; పతయే = పాలకుడైన శివుని కొఱకు; నమః అస్తు = వందనము.

మహాదేవుడు. సత్య సనాతన సారథి. రథికుల మనోరథాలకు అనుగుణంగా జీవన రథాలను ముందుకు త్రోలటంలో సమర్థుడైన సారథి ఆ దేవదేవుడు. ఆ భూతేశుడు వన పాలకుడు. ఉద్యాన వన పోషకుడు. భువన పాలకుడు. పావన జన పాలకుడు. సజ్జన పరిపాలకుడు. ఆ గిరిజాపతికి నతి.

**ఓం నమో రోహితాయ స్థపతయే వృక్షాణాంపతయే నమః**

— నవమ యజుస్సు

రోహితాయ = లోహిత వర్ణుడు; స్థపతయే = ప్రభువు అయిన రుద్రుని కొఱకు నమః అస్తు = నమస్కారము; వృక్షాణామ్ = వృక్షములకు; పతయే = పాలకుడు అగు శివుని కొఱకు; నమః అస్తు = ప్రణామము.

శంకరుడు లోహితుడు. ఈశ్వరుడు ఎర్రనైన వాడు. రోహితవర్ణుడు. అందరి హితుడు సన్నిహితుడు. సర్వ వృక్షాలకు పరిపాలకుడు. నీడ నిచ్చే చెట్ల పోషకుడు సాంబశివుడు. తాను కల్పతరు రూపం దాలుస్తాడు. వృక్ష సంపద స్వామికి బహు ప్రీతికరం. మహాదేవుడు మాలి. వనమాలి. విశ్వవనమాలి, సర్వపోషకుడు, సర్వం సహా పోషకుడు. ఆ శివమూర్తికి శిరః ప్రణామాలు.

**ఓం నమో మంత్రిణే వాణిజాయ కక్షాణాంపతయే నమః**

— దశమ యజుస్సు

మంత్రిణే = మంత్రాలోచనా కుశలుడు; వాణిజాయ = వర్తక ప్రముఖుడగు రుద్రుని కొఱకు; నమః అస్తు = నమస్కారము; కక్షాణామ్ = పూ పొదలకు పలు పొదలకు; పతయే = పాలకుడగు శివుని కొఱకు; నమః అస్తు = ప్రణతి.

మహాదేవుడు గొప్ప మంత్రాలోచనాపరుడు. మంత్రీశ్వరు లందరూ ఈశక్రాంశ సంభూతులు. వణిగ్వరులలో కుబేరునికి అందనివాడు. మహా విభవం గలవాడు మహేశ్వరుడు. వైభవ భోగాలలో సంపదలో ధనంలో ఆ స్వామికి సాటి ఎవరూ లేరు. విశ్వమే ఆ దేవుని వ్యాపార రంగస్థలం. ఆ వర్తక స్వామికి వందనాలు.

పరమశివుడు వనాలలో పెద్ద పెద్ద పర్ణాలు గల పొదలకు పరిపాలకుడు. పరిపోషకుడు. ఆకు ఆకు చాటు ఏమి జరుగుచున్నదో గమనిస్తుంటాడు. సూర్య గ్రహాదులు సంచరించే మార్గాలకు అధిపతి. అన్ని విభాగాలకు అధికారి. అష్టతనుడు.

ఓం నమో భువంతయే వారి వస్కృతా యౌషధీనాం పతయే నమః

— ఏకాదశ యజుసు.

భువంతయే = భూమిని విస్తరించువాడు; వారి వస్కృతాయ = ధనాధిపతి అగు రుద్రుని కొఱకు: నమః అస్తు = నమస్కారము; ఓషధీనామ్ = ఓషధులకు; పతయే = పాలకుడయిన శివుని కొఱకు; నమః అస్తు = వందనము.

సాంబశివుడు వన పాలకుడే కాదు త్రిభువన పాలకుడు. అన్ని రకాల భూములను భూ ప్రజలను విస్తరింప జేసి పోషించటంలో తండ్రి వంటి వాడు. స్వామిలోక పాలుడు. మహా ధనవంతుడు. ఓషధులు పెంచి పోషించి వ్యాప్తిచేసి భక్తులకు అందిస్తుంటాడు. ఆ పరమదయాసింధువునకు అభివందనాలు.

*　　　　　　*

నీవే రాజువు నేను సత్కవిని తండ్రీ! నిన్ను వర్ణించెదన్
నీవే దైవము నేను భక్తుడను తండ్రీ! నిన్ను ధ్యానించెదన్
నీవే భూమివి నేను కర్షకుడను తండ్రీ! నిన్ను పండించెదన్
నా వైదగ్ధ్యము నీవజూటు- కృప సంధానించు విశ్వేశ్వరా!

— విశ్వనాథ సత్యనారాయణ

ఓం నమ ఉచ్చైర్ఘోషాయాఽఽక్రందయతే పత్తీనాంపతయే నమః

— ద్వాదశ యజుస్సు

ఉచ్చైర్ఘోషాయ = సర్వ వ్యాప్తమగు కంఠధ్వని గలవాడు; ఆక్రందయతే =

వైరులను ఏడిపించువాడు అగు రుద్ర దేవుని కొఱకు; నమః అస్తు=నమస్కారము; పత్తీనాం పతయే=కాల్బలమునకు పతి అయిన రుద్రుని కొఱకు; నమః అస్తు= ప్రణామము.

త్రిపురాంతకుడు మహాయుద్ధ విశారదుడు. అతడు రణరంగంలో చేసే ఉగ్ర ధ్వనికి అంధకారులు రోదిస్తూ పరువులెత్తవలసిందే. ఆ త్రిలోచనుడు మహా సైన్యాధిపతి అయినకూడా పాదచారులకు పోషకంగా ధైర్యంగా తాను వారికి ముందు నడిచేవాడు. కాల్బలానికి అధిపతిగానూ ఉండేవాడు. అట్టి ఆప్తమూర్తికి అభివాదాల్సు

**ఓం నమః కృత్స్నవీతాయ ధావతే సత్వనాం పతయే నమః**

— త్రయోదశ యజుసు.

కృత్స్నవీతాయ=చుట్టూ సైన్యముగలవాడు; ధావతే=శత్రువుల వెన్నంటి తరమువాడు అగు రుద్రుని కొఱకు; నమః అస్తు=నమస్కారము; సత్వనామ్= సాత్త్వక శరణాగతులకు; పతయే=పతి అయిన శివుని కొఱకు; నమః అస్తు= వందనము.

రుద్రుడు మహా సైన్య వారాశి మధ్యలో తేలిఆడుతూండేవాడు. తన సైన్యానికి ఉత్సాహకరంగా ప్రతి స్థానంలో తానై ప్రవర్తించేవాడు. ప్రకాశించేవాడు. ఈ రుద్రమూర్తిని చూచినంతనే అరి సైన్యాలు పరుగులు తీసేవి. పారిపోయే శత్రు సేనను వెన్నంటి పరిగెత్తేవి రుద్ర సైన్యాలు. అట్టి రుద్రమూర్తికి వందనాలు.

రుద్రుడు సర్వతో గుణభద్రుడు. సత్వగుణం గల సాత్త్వికులు మనసారా శరణాగతి కోరినప్పుడు రక్షించేవాడు. శంకరుడు శరణాగత వత్సలుడు. అట్టి బోళా శంకరునకు శతసహస్ర అభినందన చందనాలు.

## తృతీయోఽనువాకః

**ఓమ్ నమః సహమానాయ నివ్యాధిన ఆవ్యాధినీనాం పతయే నమః**
**నమః కకుభాయ నిషంగిణే స్తేనానాం పతయే నమః**
**నమో నిషంగిణ ఇషుధిమతే తస్కరాణాం పతయే నమః**

నమో వంచతే పరివంచతే స్తాయూనాం పతయే నమః
నమో నిచేరవే పరిచరాయారణ్యానాం పతయే నమః
నమః సృకావిభ్యోజిఘాగ్ం సద్భ్యో ముష్ణతాం పతయే నమః
నమోఽసిమద్భ్యో నక్తంచరద్భ్యః ప్రకృన్తా నాం పతయేనమః
నమ ఉష్ణీషిణే గిరిచరాయ కులుంచానాం పతయే నమః
నమ ఇషుమద్భ్యో ధన్వావిభ్యశ్చ వో నమః
నమ ఆతన్వానేభ్యః ప్రతిదధానేభ్యశ్చ వో నమః
నమ ఆయచ్ఛద్భ్యో విసృజద్భ్యశ్చ వో నమః
నమోఽస్యద్భ్యో విద్యద్భ్యశ్చ వో నమః
నమ ఆసీనేభ్యః శయానేభ్యశ్చ వో నమః
నమః స్వపద్భ్యో జాగ్రద్భ్యశ్చ వో నమః
నమ స్తిష్ఠద్భ్యో ధావద్భ్యశ్చ వో నమః
నమః సభాభ్యః సభాపతిభ్యశ్చ వో నమః
నమో అశ్వేభ్యోఽశ్వపతిభ్యశ్చ వో నమః

## తృతీయ అనువాకము

ఓం నమః సహమానాయ నివ్యాధిన ఆవ్యాధినీనాం పతయే నమః

— ప్రథమ యజుస్సు

సహమానాయ=వైరులను పరిభవించువాడు; నివ్యాధినే=అరులను మిక్కిలి బాధించువాడు అగు; నమః= రుద్రుని కొఱకు నమస్కారము; అవ్యాధినీనామ్=వైర ప్రపంచము అంతటిని బాధించు శూరసేనకు; పతయే=పాలకుడగు శివుని కొఱకు; నమః=వందనము.

త్రిలోచనుడు త్రిపురాసురులను పరిమార్చాడు. సత్య సనాతన ధర్మానికి విరోధులైనవారిని పరిభవించటంలో కడు గడుసరి. ఆ రుద్రమూర్తికి నమోవాకాలు.

* *

ఆక్రోశించెద బాహులెత్తి ప్రభువా! ఆలింపవే! యేమి కా
మ క్రోధంబులహో! ప్రమాణతను సంపాదించె నాయందు-నీ
యక్రూరత్వము—నీ వశిత్వమును- నాయందింత పొందింపవే!
అక్రీతుండగు దాసుడన్ శివ శివా! యన్నాను విశ్వేశ్వరా!

— విశ్వనాథ సత్యనారాయణ

## ఓం నమః కకుభాయ నిషంగిణే స్తేనానాం పతయే నమః

— ద్వితీయ యజుస్సు

కకుభాయ=శిఖరము వంటివాడు, మరియు శాస్త్రవాక్కులకు ప్రాణభూతుడు, దిక్కులకు దిక్కు; నిషంగిణే=ఖడ్గహస్తుడు అయిన రుద్రుని కొఱకు: నమఃఅస్తు= నమస్కారము: స్తేనానాం పతయే=గుప్తచోరుల పతి కొఱకు; నమఃఅస్తు= నమస్కృతి అగుగాక!

మహాదేవుడు కకుప్పులకు ప్రకాశమానుడు. పర్వత శిఖర సదృశుడు. శాస్త్ర ప్రాణ వాక్కులకు జీవనాధారుడు. దిక్కులకు పెద్ద దిక్కు. ఈ మహానటుడు అన్నిరకాల చోరులను నడిపిస్తాడు. ఆ చోరులకు పాలకుడుగా ఉంటాడు. గుప్త చోరులకు పతి అయిన జగత్పతికి ప్రణామాలు.

## ఓం నమో నిషంగిణ ఇషుధిమతే తస్కరాణాం పతయే నమః

— తృతీయ యజుస్సు

నిషంగిణే=బాణాలు గలవాడు; ఇషుధిమతే=తూణీరము గలవాడు అగు; నమఃఅస్తు=రుద్రునికొఱకు నమస్కృతి; తస్కరాణామ్=ప్రకటిత చోరులకు; పతయే=అధిపతి అయిన రుద్రుని కొఱకు; నమఃఅస్తు=నమస్కారము.

పినాకపాణి విలువిద్యా ప్రవీణుడు. ఆ హరుడు మనోహరుడు మృగ వ్యాధుడు. ఆ మహాకాలునకు నమస్కారాలు. గుప్తచరులు గుప్తచోరులకే కాక

ప్రకటితచోరులైన తస్కరులకు కూడా అధిపతి ఆ స్వామి. చిత్తచోరుడు భక్తుల లోభ ధనాలను బాహ్యంగానూ గుప్తంగానూ హరిస్తాడు. మానవులలోని దుర్గుణ ధనాలను తాను స్వామిగా ఉండి హరింపజేస్తాడు. అందువల్ల 'తస్కరపతి' అనీ పేరు తెచ్చుకొన్నాడు. స్వామి లీలలన్నీ మన మేలుకే. ఆ తస్కరపతికి ధన్యవాదాలు.

ఓం నమో వంచతే పరివంచతే స్తాయూనాం పతయే నమః

— చతుర్థ యజుస్సు

వంచతే = యజమానుని మోసము చేయువాడు; పరివంచతే = అతనిని మోసము చేయువాడు అగు రుద్రుని కొఱకు: నమఃఅస్తు = నమస్సు; స్తాయూనామ్ = నమ్మకద్రోహులు అయిన; పతయే = ఆ రకము దొంగలకు పతి అయిన; నమఃఅస్తు=రుద్రుని కొఱకు నమస్సు.

హరుడు భక్తుల ధనాలు హరించి వారిని మంచిమార్గంలో నడిపిస్తాడు. వారి వారి మన స్తత్వాలు ప్రారబ్ధ కర్మలు అనుసరించి వారిని అయావిధంగా శిక్షించి సంస్కరిస్తాడు. ఆ మహానటుడు యజమానికడ ఉండి క్రయ విక్రయాలలో కొందరిని వంచనచేసి నిర్ధూత పాపులను చేస్తాడు. మరికొందరిని పరివంచన చేసి అంటే సర్వ వ్యవహారాలలో నమ్మకంగా ఉన్నట్లే ఉండి వారి పాపధనం హరిస్తాడు. అర్ధరాత్రి అజ్ఞాతులుగా వచ్చి ఆశ్రయించి ఇల్లు దోచుకొనేవారు స్తేనులు. తనవారుగా వచ్చి పగలుగాని రాత్రిగాని అవకాశం చూచి ఇల్లు దోచేవారు స్తాయువులు. ఆ చోరస్వామికి వందనము.

ఓం నమో నిచేరవే పరిచరాయారణ్యానాం పతయే నమః

— పంచమ యజుస్సు

నిచేరవే = నిత్యము దొంగబుద్ధి గలవాడు; పరిచరాయ = అంగడిచోటుల సంచులు కాజేయువాడు అయిన రుద్రుని కొఱకు; నమఃఅస్తు=నమస్సు; అరణ్యానాంపతయే=అడవి దొంగలకు నాయకుడు అగు రుద్రుని కొఱకు; నమఃఅస్తు= నమస్సు.

నిరంతరం దొంగబుద్ధితో చరించేవాడు నిచేరుడు. ఇంట్లోను వాకిట్లోను ఎక్కడ సొమ్ములు దొరుకుతాయా అని చరించేవాడు పరిచరుడు. హరుడు ఈ వేషాలు వేసుకొని భక్త సంస్కరణ కోసం సంచరిస్తాడు. ఆ చోరశిఖామణికి అభివందనాలు. ఇంతేకాదు అడవి మార్గంలో తారసపడే బందిపోటు దొంగ కూడా హరుడే. లోభంవల్ల వదలలేనివారిని హింసించి సంహరించి ధనం హరించి కర్మ విముక్తి చేస్తాడు. అట్టి అరణ్య నాయకుడికి నమోవాకాలు.

ఓం నమః సృకావిభ్యోజిఘాగ్ంసద్భ్యో ముష్ణతాంపతయే నమః

— షష్ఠ యజుస్సు

సృకావిభ్యః=వజ్రాయుధాలుగల చోరుడు; జిఘాంసద్భ్యః=ప్రాణ హంతకుడైన దొంగ అగు రుద్రుని కొఱకు; నమః అస్తు= నమస్సు; ముష్ణతాం పతయే= ధాన్య చోరులకు అధిపతి అగు రుద్రుని కొఱకు; నమః అస్తు= నమస్సు.

కొందరు వజ్రగాత్రులు. వజ్రాయుధాలు ధరించి తమ్ము తాము రక్షించుకొంటూ చోరవిద్యలో మహా ప్రవీణులవుతారు. అట్టివారు సృకావులు. కొందరు జిఘాంసువులు. వీరు బాటసారులను సంహరించి సంపత్తు దోచుకుంటారు. ఈ చోర విశేష రూపులు కూడా రుద్రాంశ సంభూతులే. ఈ ఘోర చోరవర్యులకు నమస్కారం. కొందరు వ్యవసాయ ధాన్యం పొలాలలో దొంగతనం చేసేవారు. చిన్న రకం దొంగలు వీరు. వీరికి కూడా హరుడే గురువు. ఆ ధనహరునకు నమస్కారములు.

ఓం నమోఽసిమద్భ్యో నక్తంచరద్భ్యః ప్రకృంతానాం పతయేనమః

— సప్తమ యజుస్సు

అసిమద్భ్యః=ఖడ్గధారి అగు దొంగ; నక్తంచరద్భ్యః=రాత్రి దొంగ అగు రుద్రుని కొఱకు; నమః అస్తు=నమస్కారము; ప్రకృంతానాం పతయే=ప్రాణాంతకులైన దొంగల అధిపతి; నమః అస్తు=అగు రుద్రుని కొఱకు నమస్సు.

కొందరు చోరులు అసిధారా వ్రతులు. వారు ఖడ్గధారులు. కొందరు నక్తంచరులు. రాత్రివేళల దారులు కాచి దోచుకుంటారు లేదా గృహాలకు కన్నంవేసి ధనం

హరిస్తారు. రాత్రి సమయం వారికి అనుకూలం. వీరికి హరుడే అధిపతి. వారికి వందనం.

ప్రకృంతులు ప్రాణహంతకులు. సంహరించి సంపద హరిస్తాడు. వీరి పతి అయిన అష్టతనుడికి అభివాదాలు.

ఓం నమ ఉష్ణీషణే గిరిచరాయ కులుంచానాం పతయే నమః

— అష్టమ యజుస్సు

ఉష్ణీషిణే=తలపాగ ధరించిన దొంగ; గిరిచరాయ=కొండ దొంగ అగు రుద్రుని కొఱకు; నమః అస్తు=నమస్సు; కులుంచానామ్=గృహ క్షేత్రాదులు హరించు పెద్ద దొంగల పతియగు నాయకునకు నమః అస్తు= నమస్కారము.

కొందరు తలపాగలు ధరించి గ్రామీణులవలె ప్రవేశించి చోర వృత్తి సాగిస్తారు. మిక్కిలి నమ్మకంగా ఉన్నట్లు సంచరిస్తారు. మనస్సు హరిస్తారు. మరి కొందరు గిరిచరులు. వీరు కొండలపై కట్టెలు కొట్టుకొని జీవించేవారి వస్త్రాలు పదార్థాలు సొమ్ములు దోచుకుంటారు వీరు రుద్రాంశ సంభూతులు. వీరికి నమస్సులు. వీరు కాక కులుంచులు మరొక రకం వారు. వీరు గృహాలు పొలాల పంటలు మొదలైనవి దోపిడీలు చేస్తారు. వీరి పాలకుడు గిరీశుడే. ఆ గిరీశునకు కైమోడ్పులు.

ఓం నమం ఇషుమద్భ్యో ధన్వావిభ్యశ్చవో నమః

— నవమ యజుస్సు

హే రుద్రా!=ఓ రుద్ర రూపులారా!; ఇషుమద్భ్యః=బాణాలుధరించిన వారు; ధన్వావిద్భ్యః=ధనువులు ధరించిన వారు అగు; వః= మీ కొఱకు; నమః అస్తు=నమస్సులు.

రుద్రులారా! నీ స్వరూపులు కొందరు ప్రజలను భయపెట్టుటకు ఇషువులు ధరిస్తారు. వీరి బాణాలు భయంకరాలు. ప్రాణహరాలు మాత్రం కావు. అట్టి పినాకపాణులకు నతులు. మరి కొందరు ధనుర్ధారులు. అలానే వీరి విల్లంబులు చాలా

పెద్దవి. స్వార్థబుద్ధి గల వారిని భయపెట్టి మీరు ధనం దోచేస్తారు. అట్టి మీకు వందనాలు.

ఓం నమ ఆతన్వానేభ్యః ప్రతి దధానేభ్యశ్చ వో నమః

— దశమ యజుస్సు

హే రుద్రాః = ఓ రుద్రులారా!; ఆతన్వానేభ్యః = ఎక్కుపెట్టిన నారి గలవారు; ప్రతి దధానేభ్యః = బాణము సంధించినవారు అగు; వః = మీ కొఱకు; నమః అస్తు = నమస్సులు అగుగాక!

రుద్రులారా! మీలో కొందరు ఆతన్వానులు. మీరు అల్లెత్రాళ్ళతోనే కంపింప జేస్తారు. కొందరు బాణాలు సంధిస్తుంటాడు. అట్టి మీకు నమస్కారాలు.

* *

ఎఱుకని ఎరుగక నీకున్
మరకువ నెదిరితిని- దీని మరవుము నన్నున్
కరకంఠా! క్షమియింపుము
నెరి నెవ్వరి కెరుగనగునె నీ చరితంబుల్!

—నన్నయ

ఓం నమ ఆయచ్ఛద్భ్యో విసృజద్భ్యశ్చ వో నమః

— ఏకాదశ యజుస్సు

హే రుద్రాః = ఓ రుద్రులారా!; ఆయచ్ఛద్భ్యః = నారి ఎక్కుపెట్టి లాగువారు; విసృజద్భ్యఃచ = బాణము విడుచువారును; వః = అగు మీ కొఱకు; నమః అస్తు = నమస్కారము.

ఓ రుద్రులారా! మరి మీలో కొందరు ధనువులకు అల్లెత్రాళ్ళు బిగిస్తూనే భయపెట్టి వారివద్ద గల ధనం హరిస్తారు అట్టి మీకు జోహారులు. మరి కొందరు బాణాలు గాలిలోకి విడిచి వారిని తన వశం చేసుకొంటారు. అట్టి భిల్లవేషధారులైన మీకు శతవందనాలు.

*                    *

ఉల్లము నందు అక్కటిక మూనుట మీ కులమందు గంటి మం
చల్లన మేలమాడు అచలాత్మజ మాటకు లేతనవ్వు సం
ధిల్ల కిరీటి పాశుపత దివ్యశరాప్త్యుని సేయు శాంబరీ
భిల్లుడు కృష్ణరాయల అభీష్ట శుభ ప్రతిపాది సేయుతన్

— పెద్దన

## ఓం నమోఽస్యద్భ్యో విద్యద్భ్యశ్చ వో నమః

— ద్వాదశ యజుస్సు

హే రుద్రాః=ఓ రుద్ర దేవతలారా!; అస్యద్భ్యశ్చ=బాణము లక్ష్యము వరకు పోనిచ్చు వారు; విసృజద్భ్యశ్చ=బాణమును లక్ష్యము జేర్చి వధించువారు; వః=అగు మీ కొఱకు; నమః అస్తు=నమస్కారము.

రుద్రులారా! కొందరు బాణాలను లక్ష్యాలు దాకా పోనిస్తారు. అప్పుడు కొందరు భక్తులు వివశులు అవుతారు. భక్తులను మంచి దారిలోకి తెచ్చుటకే ఇది అంతా. ఎన్ని విధాలుగా ప్రయత్నిస్తారు! అన్నీ మా కొరకే కదా! అట్టి మీకు అభి నందనలు. మరి కొంత మంది జీవులు ఆశాపాశ బద్ధులై ధనం విడవరు. అట్టివారి ప్రాణాలు బాణాలతో ఛేదించి వారికి ముక్తి నిస్తారు. అట్టి మీకు నమస్కారశతాలు.

## ఓం నమ ఆసీనేభ్యః శయానేభ్యశ్చ వో నమః

— త్రయోదశ యజుస్సు

హే రుద్రాః=ఓ రుద్రదేవులారా!; ఆసీనేభ్యః=సుఖాసీనులైన వారు; శయానేభ్యః=శయనించినవారు; వః=అగు మీ కొఱకు; నమః అస్తు=ప్రణామము అగుగాక!

ఓ రుద్ర మూర్తులారా! ఆసీనులైనారా! మానవుల మంచి కోరి ఎన్ని వేషాలు ఎన్ని రూపాలు! ఎన్ని కోపాలు! ఎన్ని తాపాలు! ఎన్ని ప్రతాపాలు! ప్రదర్శిస్తు

న్నారు! విశ్రాంతి తీసుకోండి. అభివందనాలు అందుకోండి. శంకరులారా! మరి కొంచం మా హృదయాలపై శయనించండి. నమోవాకాలు అందుకోండి!

ఓం నమః స్వపద్భ్యో జాగ్రద్భ్యశ్చ వో నమః

— చతుర్దశ యజుస్సు

హే రుద్రాః=ఓ రుద్రదేవులారా!; స్వపద్భ్యః=సుఖనిద్రలో నున్నవారు; జాగ్రద్భ్యశ్చ=మేలుకొన్నవారు; వః=అగు మీ కొఱకు; నమః అస్తు=ప్రణామాలు అగుగాక!

మహేశ్వరులారా! చాలా డస్సినారు. కొంచం సేపు నిద్రించండి. వింజామరలు వీస్తాను. విశ్రాంతి తీసుకోండి. నమోస్తు. స్వామీ! కొంచం సేపుండి మేలుకోండి. మీరు మేలుకొనకపోతే ఎలా! లోకాలు ఏమిగాను! నమశ్శతాలు.

ఓం నమ స్తిష్ఠద్భ్యో ధావద్భ్యశ్చ వో నమః

— పంచదశ యజుస్సు

హే రుద్రాః=ఓ రుద్రదేవులారా!; తిష్ఠద్భ్యః=కదలకున్నవారు; ధావద్భ్యశ్చ =వేగము గమించువారు; వః=అగు మీ కొరకు; నమః అస్తు=వందనాలు అగుగాక.

చంద్రశేఖరులారా! మేలుకొని ఇక్కడ ఈ ఆసనంపై కొంచం ఆసీనులు కండి. ధ్యానం చేసుకోండి మా విన్నపాలు అందుకోండి. వేడికోలు. లోకరక్షణార్థం ఇక బయలుదేరండి. పరుగులు తీస్తున్నారా! లోక రక్షణలో ఎంత ప్రీతి! ఎంత పట్టుదల! ఎంత వ్యగ్రులై ఉన్నారు! మీకు శత నమస్కారాలు!

ఓం నమః సభాభ్యః సభాపతిభ్యశ్చ వో నమః

— షోడశ యజుస్సు

హే రుద్రాః=ఓ రుద్రదేవులారా; సభాభ్యఃచః=సభా స్వరూపులు; సభా పతిభ్యఃచ=సభాపతి స్వరూపులు; వః=అగు మీ కొఱకు; నమః అస్తు=నమస్సులు

కైలాసపతీ! విశ్వపతీ! సభాస్వరూపా! ఆవాహయామి. దయచేయండి! సదస్యులు సభాసదులు అందరూ వచ్చారు. అంతా మీ వారే. రండి! రండి! నమస్కృతులందుకోండి. సర్వేశ్వరా! మీరే సభాపతులు. సభలు జయప్రదంగా నిర్వహించండి. సర్వేజనాః సుఖినోభవంతు! మీ పాదపద్మాలకు సర్వదా సాష్టాంగ దండ ప్రణామాలు.

### ఓం నమో అశ్వేభ్యోఽశ్వపతిభ్యశ్చ వో నమః

— సప్తదశ యజుస్సు

హే రుద్రాః=ఓ రుద్రదేవులారా!; అశ్వేభ్యః=అశ్వరూపులు; అశ్వపతిభ్యశ్చ=అశ్వ పాలకులు; వః=అగు మీ కొఱకు; నమః=నమస్కారము; అస్తు=అగుగాక!

ఆదిశంకర స్వామీ! అశ్వాలు సిద్ధంగా ఉన్నాయి. ఆరోహించండి. మా ఆత్మల నారోహించండి. అభివందనాలు. అఖిలాండ బ్రహ్మాండ పతీ! అశ్వపతులు మీరే కదా! వాహనాలు మీరే. అధిరోహకులు మీరే. అశ్వాలు మీరే. అశ్వపతులు మీరే. మీకు శతసహస్ర నమస్సులు.

* *

నే నీ దాసుడ- నీవు నా దొరవు- తండ్రీ! నూరు జన్మాలకున్
నే నీభక్తుడ- నీవు నా పతివి- తండ్రీ! వేయి జన్మాలకున్
నే నీ బిడ్డను- నీవు నా పితవు తండ్రీ! జన్మ జన్మాలకున్
నీ నా చుట్టరిక మ్మఖండ మగు తండ్రీ! బాలకోటీశ్వరా!

— కరుణశ్రీ

### చతుర్థోఽనువాకః

ఓమ్ నమ ఆవ్యాధినీభ్యో వివిధ్యన్తీభ్యశ్చ వో నమః
నమ ఉగణాభ్య స్తృగ్ంహతీభ్యశ్చ వో నమః
నమో గృత్సేభ్యో గృత్సపతిభ్యశ్చ వో నమః

నమో వ్రాతేభ్యో వ్రాతపతిభ్యశ్చ వోనమః
నమో గణేభ్యో గణపతిభ్యశ్చ వో నమః
నమో విరూపేభ్యో విశ్వరూపేభ్యశ్చ వో నమః
నమో మహద్భ్యః క్షుల్లకేభ్యశ్చ వో నమః
నమో రథిభ్యోఽరథేభ్యశ్చ వో నమః
నమో రథేభ్యః రథపతిభ్యశ్చ వో నమః
నమః సేనాభ్యః సేనానిభ్యశ్చ వో నమః
నమః క్షత్తృభ్యః సంగ్రహీతృభ్యశ్చ వో నమః
నమః తక్షభ్యో రథకారేభ్యశ్చ వో నమః
నమః కులాలేభ్యః కర్మారేభ్యశ్చ వో నమః
నమః పుంజిష్టేభ్యో నిషాదేభ్యశ్చ వో నమః
నమ ఇషుకృద్భ్యః ధన్వకృద్భ్యశ్చ వో నమః
నమో మృగయుభ్యః శ్వనిభ్యశ్చ వో నమః
నమః శ్వభ్యః శ్వపతిభ్యశ్చ వో నమః

## చతుర్థ అనువాకము

ఓం నమ ఆవ్యాధినీభ్యో వివిధ్యం తీభ్యశ్చ వో నమః

— ప్రథమయజుస్సు

హేరుద్రాః = ఓ రుద్రులారా !; ఆవ్యాధినీభ్యః = వ్యాధుల రూపంలో అంతట వ్యాపించి పాపులనుబాధించు స్త్రీ మూర్తులు; వివిధ్యంతీభ్యశ్చ = పాపులను విశేషముగా బాధించు స్త్రీ స్వరూపులు అయిన; వః = మీ కొరకు; నమః అస్తు = నమస్కారము

గిరిజాధిపతీ! పార్వతీ మనోహరా! ఎన్ని వేషాలు వేస్తావు స్వామీ! మాయాబోయతగాను మాయాస్త్రీగాను ఉగ్రదేవతగాను వ్యాధిరూపందాల్చి భూభారాన్ని తొలిగిస్తావా! మారీ మశూచీ నీవే కదా! ఆ రుద్రాంశలే స్త్రీ రూపం దాల్చి వ్యాధి వ్యాప్తిజేసి బాధిస్తారు.

ఓం నమ ఉగణాభ్యః తృగ్ంహతీభ్యశ్చ వో నమః

— ద్వితీయ యజుస్సు

హేరుద్రాః = ఓ రుద్రులారా!; ఉదణాభ్యః = సప్తమాతృకాది స్త్రీ స్వరూపులు తృగ్ంహతీభ్యః = రాక్షసులను సంహరించు దుర్గాద్యుగ్ర దేవతా స్వరూపులు అగు; వః = మీ కొరకు; నమోస్తు = నమస్కారము.

ఈ రుద్రదేవతలలో ఉత్కృష్ట దుర్గాదేవతాగణ మాతృకలున్నాయి. వీరు సప్త మాతృకలు. ఆ తల్లులకు వేడికోలు. వీరంతా రుద్రదేవతలే. మరికొందరు మాతృకా గణ పరివేష్టితులు. చూపులతోనే సూదులు గ్రుచ్చి బాధిస్తారు. మశూచికాది దేవతలట్టివారు ఓ సప్త మాతృకలారా! మీకు మా మ్రొక్కులు చెల్లిస్తాము.

ఓం నమః గృత్సేభ్యో గృత్సపతిభ్యశ్చ వో నమః

—తృతీయ యజుస్సు

హే రుద్రాః = ఓ రుద్రదేవులారా !; గృత్సేభ్యః = విషయలంపటుల స్వరూపులగు; గృత్సపతిభ్యశ్చ=విషయలంపటులకధిపతుల స్వరూపులగు; వః=మీ కొరకు; నమోస్తు = నమస్కారము.

అష్టమూర్తీ! అభివాదాలు! విషయలంపటునివలె నటిస్తున్నావా! ఆ విషయలంపటులకు విషయాసక్తులకు మహానాయక వేషం కూడా వేశావా! విషయ పతివీ పాలకుడవూ నీవేనా! నీలకంఠా! నీకు సహస్ర నమస్కారాలు!

ఓం నమో వ్రాతేభ్యో వ్రాతపతిభ్యశ్చ వో నమః

— చతుర్థ యజుస్సు

హేరుద్రాః = ఓ రుద్రదేవులారా! వ్రాతేభ్యః = నానాజాతి సమూహ

స్వరూపులు, వ్రాతపతిభ్యశ్చ = సంఘాధిపతులు అగు, వః = మీ కొరకు, నమోస్తు = నమస్కారము.

మహా నటేశ్వరా! నమోస్తు. సంఘం నీవే. సదస్యులు నీవే. సమస్తము నీవే సభ్యులు నీవే. సంఘానికి నాయకుడవు నీవే. సంఘం ఇలా ఉండాలనీ, సంఘ నాయకుడు ఇలా ఉండాలనీ మాకు పాఠం చెప్తున్నావా!

వ్రాతపతీ! వ్రాతపాలకా! వందనాలు. నీపాద సరోజాలకు నమామి!

ఓం నమో గణేభ్యో గణపతిభ్యశ్చ వో నమః

— పంచమ యజుస్సు

హే రుద్రాః = ఓ రుద్ర దేవులారా; గణేభ్యః = భూత గణ విశేషరూపులు: గణపతి భ్యశ్చ = ఆ గణాలకు పాలకులు అగు; వ: = మీ కొరకు; నమోస్తు = నమస్కారము.

నటరాజా! నతులు. లోకంలో ఎన్ని గణాలు, గణతంత్రాలు ఉన్నాయో. అన్నిటిలో నీ ఆత్మశక్తి ద్యోతమాన మవుతోంది. నీ శక్తి ఉంటేనే అది శివం! లేనిది శవం కదా! భూత గణాలు నీవే. గణపతివి నీవే! హే గణపతీ! నీకు నమస్కృతి.

ఓం నమో విరూపేభ్యో విశ్వరూపేభ్యశ్చ వో నమః

— షష్ఠ యజుస్సు

హే రుద్రాః = ఓ రుద్ర దేవులారా! విరూపేభ్యః = వికృత స్వరూపులు, విశ్వ రూపేభ్యశ్చ = గజాశ్వ నక్త్రి ఆదిగా గల వివిధ విశ్వరూపులు అగు, వః = మీ కొరకు, నమోస్తు = నమస్కారము.

హే విరూపాక్షా! నమస్కారము విరూపుడు, కురూపుడు, అపురూపుడు ముండుడు నగ్నుడు ప్రతివేషధారివి నీవే! అన్ని అవరూపాలు సురూపాలూ నీవే. జగన్నాటకంలో అన్ని వేషాలు నీవే. వేషాలను ఆడించేదీ నీవే. హే విశ్వరూప ధారీ! హే పాత్రధారీ! హే సూత్రధారి! ప్రణామాలు.

* *

విరూపాక్ష విశ్వేశ్వర్యాది కేశ !
త్రయీ మూల శంభో శివత్ర్యంబకత్వమ్
ప్రసీద స్మర త్రాహి పశ్యావపుష్య
క్షమస్వా ప్నుహీతి ప్రభో ప్రార్థయామః

— శివ భుజంగ ప్రయాతం

ఓం నమో మహద్భ్యః క్షుల్లకే భ్యశ్చ వో నమః

— సప్తమ యజుస్సు

హే రుద్రాః=ఓ రుద్ర దేవులారా!, మహద్భ్యః = మహదైశ్వర్యోపేతులు క్షుల్లకేభ్యశ్చ = దరిద్రులు అయిన స్వరూపము దాల్చిన, వః = మీ కొరకు, నమోస్తు = నమస్కారము.

నమస్తే !మహేశ్వరా ! అణిమాది అష్ట ఐశ్వర్యః మూర్తివి నీవు. ఐశ్వర్య వంతుడవు. ఐశ్వర్య ప్రభుడవు. ఐశ్వర్యం ప్రసాదించువాడవు. నీ విభూతియే మహైశ్వర్యం. ఆ విభూతి నాకు చాలు ప్రభూ !

ఓం నమో రథిభ్యో రథేభ్యశ్చ వో నమః

— అష్టమ యజుస్సు

హేరుద్రాః=ఓ హేరుద్ర రూపులారా ! రథిభ్యః=రథికులుః అరథేభ్యశ్చ= రథ రహితులైన, వః = మీ కొరకు, నమోస్తు = నమస్కారము.

సుమేరురథీ ! మహాయోధాగ్రణీ ! మహారణరంగ భూమిలో ఘోర రాక్షస సంకుల సమరంలో నీవు రథికుడవు. మహారథికుడవు, మహా పినాకధారివి. జేతవు నేతవు. నీకివే ప్రణామ సహస్రాలు. నీవు అరథికుడవు. రథాలు లేనివాడవు. పథి కుడవు. యోధుడవు. కాల్బలంలో ఒక బంటువు. అన్ని చోట్ల నీవే ఉన్నావు. నీకు నీరాజనాలు !

### ఓం నమో రథేభ్యః రథపతిభ్యశ్చ వో నమః

— నవమ యజుస్సు

హే రుద్రాః = ఓ రుద్రులారా! రథేభ్యః = రథ స్వరూపులు, రథ పతిభ్యశ్చ = రథాధిపతులు అయిన, వః = మీ కొరకు, నమోస్తు = నమస్కారము

శంకరా! నీవు కేవలం మహారథికుడ వేకాదు. రథ రూపుడవు. నీవు రథమై రణ రంగంలోనికిదిగుతావు. నీవే రథమై నప్పుడు అది విజయ రథమై అభీష్ట మనోరథమై ప్రకాశిస్తుంది. రథమూనీవే రథాధిపతిని నీవే. నడిచేదీ నీవే. నడిపేదీ నీవే. సర్వమూ నీవే. నీవు కానిదిలేదు. సర్వాధిపతీ! సర్వజ్ఞా! సాంబమూర్తీ! సహస్ర వందనాలు.

### ఓం నమః సేనాభ్యః సేనానిభ్యశ్చ వో నమః

—దశమ యజుస్సు

హే రుద్రాః = ఓ రుద్రులారా!; సేనాభ్యః = సేనా స్వరూపులు; సేనానిభ్యశ్చ = సేనాపతి స్వరూపులునగు; వః = మీకొరకు; నమోస్తు = నమస్కారము.

సాంబా! సాయీశ్వరా! నమస్సు. మహాఘోర సంసార సమరంలో సేనవు నీవే. మమ్ము నడిపించే కుశల సేనానివీ నీవే. నీకు ప్రణామాలు.

### ఓం నమః క్షత్తృభ్యః సంగ్రహీతృభ్యశ్చ వో నమః

— ఏకాదశ యజుస్సు

హే రుద్రాః! = ఓ రుద్రులారా! క్షత్తృభ్యః = ద్వారపాలక స్వరూపులు; సంగ్రహీతృభ్యశ్చ = సంగ్రహీతృ స్వరూపులు అగు; వః = మీ కొరకు; నమోస్తు.

నటరాజా! నాగభూషా! ద్వారపాలక వేషా! పాహిమాం ప్రభూ! ఎంత భక్త వత్సలత నీది! హృదయార్పణ బుద్ధితో నిన్ను అర్థించినంతనే వారి భవనాలకు ద్వారపాలకుడుగా వెళ్ళేదీ నీవే. ఆ భవనాలలోనికి ద్వారపాలకుల కన్నుగప్పి, లోనికి జొరబడేదీ నీవే. అన్ని రూపాలు నీవే కదా! దయాశంకరా! శతప్రణామాలు.

ఓం నమ స్తక్షభ్యో రథకారేభ్యశ్చ వో నమః

— ద్వాదశ యజుస్సు

హే రుద్రాః!=ఓ రుద్రులారా! తక్షభ్యః=వడ్లబత్తుల వారి స్వరూపులు కొయ్య పనివారు. వడ్రంగివారు; రథకారేభ్యశ్చ=రథాలు చేయు వారు అగు; వః=మీ కొరకు; నమోస్తు.

హే రుద్రా! గ్రామంలో సామాన్యంగా ఉండే వడ్రంగివి నీవు. కొయ్య సామానులు చేసి బండ్లు నిర్మించి నాగళ్ళు తయారుచేసి ప్రజల ఉపయోగం కొరకు అనేక పనులు చేస్తుంటావు. గ్రామానికి గుండెకాయవలె ఉంటావు; అంతేకాక రథాలు వాహనాలు చేసే మహా శిల్పివీ నీవే. నీకు నమస్కారము.

ఓం నమః కులాలేభ్యః కర్మారేభ్యశ్చ వో నమః

— త్రయోదశ యజుస్సు

హే రుద్రాః!=ఓ రుద్రులారా!; కులాలేభ్యః=కుమ్మరులు; కర్మారేభ్యః=కమ్మరులు అగు; వః= మీ కొరకు; నమోస్తు=నమస్కారము.

ఓ రుద్రా! నమోస్తు! మట్టిపాత్రలు తయారుచేసే కుమ్మరివి నీవే. వ్యవసాయ పనిముట్లు చేసే కమ్మరివి నీవే! నీవు సర్వకార్య నిర్వాహకుడవు. నీకు వందనాలు

ఓం నమః పుంజిష్టేభ్యో నిషాదేభ్యశ్చ వో నమః

— చతుర్దశ యజుస్సు

హే రుద్రాః!=ఓ రుద్రులారా!; పుంజిష్టేభ్యః=పిట్టలు కొట్టుకు తినేవారు; నిషాదేభ్యః=చేపలు పట్టి జీవించేవారు నగు; వః=మీ కొరకు; నమోస్తు!

భిల్లేశ్వరా! జనులందరూ నీ రూపులే కదా! అడవిలో పక్షులను చంపుకు తినే కిరాతకుడు నీవే. నదులలో చేపలు పట్టుకొని జీవించే జాలరివీ నీవే. నీకు నమస్కారం!

* *

పశూనాంపతిం పాపనాశం సురేశం
గజేంద్రస్య కృత్తిం వసానం వరేణ్యం
జటా జూటమధ్యే స్ఫురద్గాంగవారిం
మహాదేవమేకం స్మరామి స్మరారిమ్!

— వేదసార శివస్తోత్రం.

ఓం నమ ఇషుకృద్భ్యః ధన్వకృద్భ్యశ్చ వో నమః

— పంచదశ యజుస్సు

హే రుద్రాః! ఇషుకృద్భ్యః=బాణాలు చేయువారు; ధన్వకృద్భ్యః=ధనువులు చేయువారు అగు; వః=మీ కొరకు; నమోస్తు!

మహాకాల స్వరూపా! రుద్రా! నమస్తే! బాణాలు తయారు చేసేవారు ఇషుకృత్తులు. ధనువులు నిర్మాణం చేసేవారు ధన్వకృత్తులు. ఈ రెండు రూపాలు నీవే కదా స్వామీ!

* *

ఎరుకని ఎరుగక నీకున్
మరకువ నెదిరితిని- దీని మరవుము - నన్నున్
కరకంఠా! క్షమియింపుము
నెరి నెవ్వరి కెరుగ నగునె! నీ చరితంబుల్ !

— నన్నయ

ఓం నమో మృగయుభ్యః శ్వనిభ్యశ్చ వో నమః

— షోడశ యజుస్సు

హే రుద్రాః! మృగయుభ్యః=వేటకాండ్రు; శ్వనిభ్యః=కుక్కలను పెంచే వారు అగు; వః=మీ కొరకు; నమోస్తు!

ఓ మృగ వ్యాధా! రుద్రా! నమస్తే! మృగయా వినోదివి నీవు. వేటాడి దుష్ట మృగాలను పరిమారుస్తావు. వేటగాండ్ర రూపంలో, శునకాలను పెంచేవారి రూపం లోను ఉన్న నీకు నమస్సులు.

ఓం నమః శ్వభ్యః శ్వపతిభ్యశ్చ వో నమః

— సప్తదశ యజుస్సు

హే రుద్రాః!=ఓ రుద్ర దేవతలారా!; శ్వభ్యః=శునకస్వరూపులు; శ్వపతిభ్యశ్చ=శునక పాలకరూపులు అగు; వః=మీ కొరకు; నమోస్తు = నమస్కారము.

బహురూపధారీ! పరమేశ్వరా! హరా! పరాత్పరా! శంకరా! భక్తకింకరా! నమోవాకం. కాలభైరవుడవు నీవే. శునక పాలకుడవు నీవే. పశుపతివి. శ్వపతివి. జగత్పతివినీవు!

పంచమోఽనువాకః

ఓమ్ నమో భవాయచ రుద్రాయచ
నమః శర్వాయచ పశుపతయేచ
నమో నీలగ్రీవాయచ శితికంఠాయచ
నమః కపర్దినేచ వ్యుప్తకేశాయచ
నమః సహస్రాక్షాయచ శతధన్వనేచ
నమో గిరిశాయచ శిపివిష్టాయచ
నమో మీఢుష్టమాయ చేషుమతే చ
నమో హ్రస్వాయచ వామనాయ చ
నమో బృహతేచ వర్షీయసేచ
నమో వృద్ధాయచ సంవృధ్వనే చ
నమో అగ్రియాయచ ప్రథమాయచ
నమ ఆశవే చాజిరాయచ
నమః శీఘ్రియాయచ శీభ్యాయచ
నమ ఊర్మ్యాయచావస్వన్యాయ చ
నమః స్రోతస్యాయచ ద్వీప్యాయచ

## పంచమ అనువాకము

### ఓం నమో భవాయచ రుద్రాయచ

— ప్రథమ యజుస్సు

భవాయచ=ప్రాణుల భవమునకు హేతు భూతుడగు శివుని కొరకు: నమః అస్తు; రుద్రాయచ=రోదనము పోగొట్టువాడగు రుద్రుని కొరకు; నమోస్తు!

పరమేశ్వరుడు పార్వతీ మనోహరుడు. పార్వతీ పరమేశ్వరులు జగత్తుకు తల్లి దండ్రులు. అందువల్ల శివుడు భవుడు. సర్వజీవ కోటి భవమునకు కారణభూతుడు, అట్టి భవానీ పతికి ప్రణామాలు. శివుడు రుద్రుడు. రోదన హేతువైన దుఃఖాన్ని పోగొట్టువాడు, రోదనం నాశనం చేయువాడు రుద్రుడు. అట్టి రుద్ర స్వామికి నమోస్తు!

* *

హే పార్వతీ హృదయ వల్లభ! చంద్ర మౌళే!
భూతాధిప! ప్రమథ నాథ! గిరీశ చాప!
హే వామదేవ! భవ! రుద్ర! పినాక పాణే!
సంసార దుఃఖ గహనాత్ జగదీశ! రక్ష!

### ఓం నమః శర్వాయచ పశుపతయేచ

—ద్వితీయ యజుస్సు

శర్వాయచ=పాపము పోగొట్టువాడు అగు రుద్రుని కొరకు; పశుపతయేచ= జీవులగు పశువులను పాలించు శివుని కొరకు; నమస్సు!

పార్వతీ నాథుడు సర్వ కిల్బిషాలు నాశనం చేసే శుభంకరుడు. అందుచే ఆయన శంకరుడు. ఈ విశ్వంలో అజ్ఞానులెల్లరు పశువులే. అజ్ఞానులను కూడా అమిత దయతో పాలించేవాడు కనుక ఆ స్వామికి 'పశుపతి' అని పేరు. అట్టి పశుపతికి పాదాభినందనం.

* *

రుద్రం పశుపతిం స్థాణుం
నీలకంఠ ముమాపతిమ్
నమామి శిరసా దేవం
కిన్నో మృత్యుః కరిష్యతి!

— చంద్రశేఖరాష్టకమ్.

ఓం నమో నీలగ్రీవాయచ శితి కంఠాయచ

—తృతీయ యజుస్సు

నీలగ్రీవాయచ=నీలకంఠుడైన శివుని కొరకు; శితికంఠాయచ=శ్వేత కంఠుడైన శివుని కొరకు; నమస్సు!

దయా శంకరుడు నీలగ్రీవుడు. శివుడు లోక సంరక్షణార్థమై సముద్రోద్భవ కాలకూట గ్రహణం చేసి కంఠం కందిపోయి నీలగ్రీవుడైనాడు. అట్టి లోకోపకార ధురీణుడైన శంభుపునకు నమస్కార శతాలు. ఆ శంభుడు శుభగాత్రుడు. ధవళ స్ఫటిక సదృశదేహుడు శివుడు. అపుడు ఆది శంకరుడి కంఠం కూడా శితం కదా! ప్రథమంలో తెల్లగా అందంగా అలరారు స్వామిని శితికంఠుడు అన్నారు. అట్టి శితికంఠునకు నమస్సులు.

ఓం నమః కపర్దినే చ వ్యుప్తకేశాయచ

—చతుర్థ యజుస్సు

కపర్దినే చ= జటాజూటధారియగు రుద్రుని కొరకు; వ్యుప్తకేశాయచ= ముండితకేశుడగు శంకరుని కొరకు; నమః=నమస్కారము;

కాలకంఠుడు కపర్ది స్వామి జటాజూటుడు సత్యసాయీశ్వర రూపుడు. గంగావతరణం కోసం కపర్దములు జడలు పెంచాడు. వ్యోమ కేశుడైనాడు మహేశ్వరుడు మహా యతీశ్వరుడు. ముండితకేశుడు మహేశుడు. జగద్గురు శంకరాచార్య రూపుడు అందువల్ల ఆ స్వామికి 'వ్యుప్తకేశుడు' అని పేరు కలిగింది. అట్టి యతిలోక చంద్రునకు సహస్ర వందనాలు.

ఓం నమః సహస్రాక్షాయ చ శతధన్వనే చ

—పంచమయజుస్సు

సహస్రాక్షాయ చ=వేలకొలది కన్నుల వాడగు రుద్రుని కొరకు; శతధన్వనే చ=వందలకొలది ధనువులు గల వాడగు శివుని కొరకు; నమః=నమస్కారము;

సాంబమూర్తి సర్వజ్ఞుడు. సహస్రశీర్షుడు. సహస్రాక్షుడు. సహస్రపాదుడు. సహస్రహస్తుడు. సహస్రవిధాల సహస్ర లోకాలను నిత్యము కాపాడుతుంటాడు. అట్టి సహస్ర పురుషునకు సహస్రాభివందనాలు. రుద్రుడు సహస్ర భుజావతారుడు. ప్రతి భుజంలోనూ ఆయుధం ధరించి అరులను హడల గొడతాడు. శంకరుడు శత ధన్వి. స్వామి ధనుస్సులు శత సంఖ్యాకం. ఆ స్వామికి శత నమస్కారాలు.

ఓం నమో గిరిశాయచ శిపివిష్టాయచ

—షష్ఠ యజుస్సు

గిరిశాయచ=కైలాసేశ్వరుని కొరకు నమస్సు; శిపివిష్టాయచ=విష్ణురూపధారి యగు శివుని కొరకు నమస్సు;

కైలాసవాసికి గిరిశుడని ప్రసిద్ధమైన నామం. తెల్లని వెండికొండలపై నుండే వాడు శంకరుడు. శిపివిష్టుడు అంటే విష్ణుమూర్తి వంటి వాడు; సర్వవ్యాప్తి గలవాడు. పశుపతి. "శిపివిష్టాస్తు దుశ్చర్మ ఖల్వాట హరి శంకరాః" అని నానార్థ సంగ్రహం. శిపివిష్టుడు అంటే హరిహరులు అని అర్థం. కనుక అట్టి శిపివిష్టుడికి శిరసా నమస్సులు.

ఓం నమో మీఢుష్టమాయ చేషుమతేచ

—సప్తమ యజుస్సు

మీఢుష్టమాయచ=మేఘుడై మిగుల వర్షించు శంకరుని కొరకు నమస్సు; ఇషుమతేచ=బాణాలు ధరించిన రుద్రుని కొరకు నమస్సు;

శంకరుడు దయా హృదయుడు. భక్త వరదుడు. అభీష్టప్రదుడు. భక్తులకు వరాలు వర్షం కురిపించినట్లు మేఘుడై అనుగ్రహించువాడు. ఆ భక్త మేఘునకు అభివాదాలు. పినాకపాణి బాణధారి. బాణాలు వర్షధారల వలె కురిపించి భక్త రక్షణం

చేస్తాడు. శత్రువులను పరాభూతులకు చేస్తాడు. ఆ బాణాలు ప్రాణాలు ఇస్తాయి. అదే బాణాలు ప్రాణాలు తీస్తాయి. ఆ స్వామికి అభినందనలు.

## ఓం నమో హ్రస్వాయచ వామనాయచ

—అష్టమ యజుస్సు

హ్రస్వాయచ = హ్రస్వరూపుడైన శివుని కొరకు నమస్సు: వామనాయచ = వామనుడైన ఈశ్వరుని కొరకు నమస్సు.

హరుడు హ్రస్వరూపుడు. కానీ అఖండ ఆత్మబలశాలి. శారీరకంగా అల్పుడు. స్వల్ప రూపంతో అందరి హృదయాలలో ఇమిడిపోతాడు. అట్టి హ్రస్వ మూర్తికి సహస్ర ప్రణామాలు. స్వామి అంగుళ్యాద్యవయవ సంకోచ స్నిగ్ధమూర్తి కడు చిన్నవాడు. మహామేధావి దశాంగుళ మూర్తి. అట్టి వామనమూర్తియైన ఈశ్వరుడికి నమస్కారాలు.

* *

హే పార్వతీ హృదయ వల్లభ! చంద్రమౌళే!
భూతాధిప! ప్రమథనాథ! గిరీశచాప!
హే వామదేవ! భవ! రుద్ర! పినాకపాణే!
సంసారదుఃఖ గహనాజ్జగదీశ! రక్ష!

## ఓం నమో బృహతేచ వర్షీయసేచ

—నవమ యజుస్సు

బృహతేచ = పెద్దదైన శివుని కొరకు నమస్సు: వర్షీయసేచ = గుణసమృద్ధుడైన శివుని కొరకు నమస్సు:

మహాదేవుడు బృహత్కాయుడు. శరీర ఆకారం చాలా పెద్దది. పదునాల్గు లోకాలు ఆ స్వామి శరీరంలోనే ఉంటాయి కదా! ఆ మహామూర్తికి అభివాదాలు. మహేశ్వరుడు సుగుణ సమృద్ధుడు. ఆ స్వామికి నమస్కారాలు.

ఓం నమో వృద్ధాయచ సంవృధ్వనేచ

—దశమ యజుస్సు

వృద్ధాయచ=వయోవృద్ధుడైన శివుని కొరకు నమస్సు: సంవృధ్వనేచ= సంస్తుతులచే వృద్ధి చెందిన శివునికొరకు నమస్సు:

మహాదేవుడు మహా వృద్ధుడు. వయస్సుచేత వపుస్సుచేత జ్ఞాన మహస్సుచేత అధికుడు. అన్ని విషయాలలో మహోన్నతుడు. ఆ స్వామికి వందనాలు. సదా శివుడు స్తవనీయుడు. దేవతలు మహర్షులు మహీ దేవులు మహాదేవుడిని మనసారా మందార పుష్పాలతో సంస్తుతి చేస్తుంటారు. ప్రస్తుతులచేత ప్రవర్థమాన మవు తుంటాడు ప్రమథాధిపుడు. అలా వృద్ధి పొందినవాడు సంవృధ్వుడు సాంబశివుడు. ఆ జ్ఞాన వృద్ధుడికి అభివందనాలు.

ఓం నమో అగ్రియాయచ ప్రథమాయచ

—ఏకాదశ యజుస్సు

అగ్రియాయచ=జగత్తుకు పూర్వము ముందు అగ్రస్థానములో గలవాడగు శివుని కొరకు; ప్రథమాయచ=సభల ప్రథమ స్థానీయుడగు శివునికొరకు; నమః= నమస్కారము

ఆ శివుడు దేవతాగ్రమూర్తి. అగ్రేసరుడు. ఆ శివుడు జగదుత్పత్తికి ముందే ఉన్నాడు. సుస్థిరుడు. అట్టి అగ్రియుడైన ఆది శంకరునకు అభివాదాలు. సర్వేశ్వ రుడు సర్వ ప్రథముడు. సభాసదులలో అతి ముఖ్యుడు. ప్రథమ పూజార్హుడు. అట్టి ప్రమథులలో ప్రప్రథముడైన నారాయణ మిత్రునకు నమోవాకాలు.

ఓం నమ ఆశవే చాజిరాయచ

— ద్వాదశ యజుస్సు

ఆశవేచ=సర్వవ్యాప్తి గలవాడు అగు శివుని కొరకు నమస్సు: అజిరాయచ= గమనశీలుడు అగు శివుని కొరకు నమస్సు.

ఆదీ శంకరుడు అన్ని దిక్కులందు వ్యాపించి యున్నాడు. అతి శీఘ్రముగా వ్యాపించేవాడు. అంతటా గమనమునందు సమర్థుడు. ఆ స్వామి సర్వాంతర్యామి. సర్వ సమర్థుడు అయిన శంకర స్వామికి నమస్కారము.

ఓం నమః శీఘ్రియాయచ శీభ్యాయచ

— త్రయోదశ యజుస్సు

శీఘ్రియాయచ=శీఘ్రగామి అగు శివుని కొరకు నమస్సు: శీభ్యాయచ=జల ప్రవాహ అంతర్భూతుడు అగు శివుని కొరకు నమస్సు.

శివుడు శీఘ్రగామి. శీఘ్ర వరదుడు. ఆర్తత్రాణ పరాయణుడు. భక్తులను శీఘ్రముగా పాలించువాడు. భక్త వత్సలుడు. అట్టి శీఘ్రగామియైన భక్తవరదునకు ప్రణామాలు. గంగాధరుడు ఉదక ప్రవాహంలో ఈదులాడుతూంటాడు. ఆనంద వారి ప్రవాహమగ్నుడు మహేశ్వరుడు. "శీభ" ఉదక ప్రవాహం. శీభే అవస్థితః శీభ్యః గంగా మనోహరుడైన గిరీశుడు శీభ్యుడు. ఆ శీభ్య మూర్తికి శిరసా నమస్కారాలు.

ఓం నమ ఊర్మ్యాయ చావస్వన్యాయచ

— చతుర్దశ యజుస్సు

ఊర్మ్యాయచ=తరంగాలలో తేలియాడే శివుని కొరకు నమస్సు: అవస్వన్యాయచ=నిశ్శబ్ద జల సంస్థితుడు అగు శివుని కొరకు నమస్సు.

గంగాధరుడు జల తరంగాలలో వినోదించువాడు. పవిత్ర గంగా ప్రవాహ తరంగాలలో తన్మయుడై పరమేశ్వరుడు ఆనంద మందుతుంటాడు. నిశ్శబ్ద జల ప్రదేశాలలో ఆనందంగా ఉంటాడు. అటువంటి గంగాధరునికి నమస్సు.

ఓం నమ స్రోతస్యాయచ ద్వీప్యాయ చ

— పంచదశ యజుస్సుః

స్రోతస్యాయచ=ప్రవాహమందున్నవాడు అగు శివుని కొరకు నమస్సు ద్వీప్యాయచ=జలమధ్య ద్వీపాలలో ఉన్నవాడు అగు రుద్రుని కొరకు నమస్సు.

గంగా ప్రవాహ వీచికలో వినోదించే విశ్వేశ్వరుడికి వేడికోలు. జల ప్రవాహాలలోని మధ్య భూములు ద్వీపాలు. శంకరుడి ద్వీపవాసం ఇష్ట ప్రదం. అట్టి ద్వీపవాసుడైన ఈశ్వరునకు నమోవాకాలు.

## షష్ఠోఽనువాకః

ఓమ్ నమో జ్యేష్ఠాయ చ కనిష్ఠాయచ
నమః పూర్వజాయ చాపరజాయ చ
నమో మధ్యమాయ చాపగల్భాయచ
నమో జఘన్యాయ చ బుధ్నియాయ చ
నమః సోభ్యాయ చ ప్రతిసర్యాయ చ
నమో యామ్యాయచ క్షేమ్యాయ చ
నమ ఉర్వర్యాయచ ఖల్యాయచ
నమః శ్లోక్యాయ చావసాన్యాయచ
నమో వన్యాయచ కక్ష్యాయచ
నమః శ్రవాయచ ప్రతిశ్రవాయచ
నమ ఆశుషేణాయచాఽఽశురథాయచ
నమః శూరాయ చావభిన్దతే చ
నమో వర్మిణేచ వరూథినేచ
నమో బిల్మినేచ కవచినేచ
నమః శ్రుతాయచ శ్రుతసేనాయచ
షష్ఠ అనువాకము

ఓం నమో జ్యేష్ఠాయ చ కనిష్ఠాయచ

— ప్రథమ యజుస్సు

జ్యేష్ఠాయచ=విద్యా సంపదలు గలవాడు. అన్నిటా అధికుడు. పెద్దవాడు అగు శివుని కొరకు; కనిష్ఠాయచ=విద్యాసంపదలు లేనివాడు చివరివాడు అగు శివుని కొరకు; నమః=నమస్కారము.

మహేశ్వరుడు విద్యానిధి. విశ్వేశ్వరుడు వివిధైశ్వర్య శోభితుడు. ఆ స్వామికి ప్రథమ ప్రణామము. అహి భూషణుడు ఐశ్వర్యవంతుడు కాదు. ఏమీ లేనివాడు. చిన్నవాడు. కనిష్ఠుడు కడగొట్టు బిడ్డ సృష్టికి ఆది అంతములు ఈశ్వరుడే. పెద్ద చిన్న శివుడే. అట్టి అకించనుడైన కనిష్ఠ మూర్తికి మహాకాలమూర్తికి నమస్కారము.

ఓం నమః పూర్వజాయ చాపర జాయచ

— ద్వితీయ యజుస్సు

పూర్వజాయచ=జగదాది యందు హిరణ్య గర్భుడై యున్నవాడగు శివుని కొరకు; అపరజాయచ=జగదవసాన కాలమందుండు వాడు అగు శివుని కొరకు; నమః=నమస్సు!

ఆదిశంకరుడు జగదాది పురుషుడు. హిరణ్యగర్భుడు. సృష్ట్యాదిలో ఉద్భ వించినవాడు. కనుక పూర్వజుడు. ఈశానుడు ఆదిజుడేకాడు. అపరజుడు. అపరమైన జగదవసాన కాలంలో కాలాగ్ని రూపంలో ప్రళయ రూపుడై అపరజుడుగా అవత రిస్తాడు శివుడు. అట్టి విశ్వ విరాణ్మూర్తికి ప్రణామాలు.

ఓం నమో మధ్యమాయ చాపగల్భాయచ

— తృతీయ యజుస్సు

మధ్యమాయచ=ఆద్యంతముల మధ్య దేవాది వివిధ రూపుడై యుండువాడు అగు శివుని కొరకు; అపగల్భాయచ=ఇంద్రియ బలుడు గాని బాలుడగు శివుని కొరకు; నమః=నమస్సు.

సర్వదేవమయుడు మహాదేవుడు. సృష్టికి ఆది అంతములందే కాక మధ్యమావతారం కూడా మహేశ్వరుడే. స్వామి ఒక్కొకసారి అపగల్భుడై అర్భకుడివలె ప్రకర్షముగా ఏర్పడని ఇంద్రియాలు గల బాలకుడి వలె ఉంటాడు. అట్టి అమాయక అపగల్భుడైన బాల శివుడికి ప్రణామాలు.

## ఓం నమో జఘన్యాయచ బుధ్నియాయచ

— చతుర్థ యజుస్సు

జఘన్యాయచ=జఘన భాగము వరకు వచ్చు వత్సాది రూపుడు అగు శివుని కొరకు; బుధ్నియాయచ=వృక్షశాఖాది రూపమున జనించినవాడగు శివుని కొరకు; నమః=నమస్సు.

శివుడు జఘన్యుడు. తల్లి ఆవు వద్ద పాలుత్రాగే దూడయై ఉంటాడు. మాతృప్రేమ అందుకొని ఆనందిస్తుంటాడు. శివుడు తరుణ తరుశాఖా కోమల సుస్నిగ్ధ రూపం కూడా దాలుస్తాడు. వృక్షశాఖల రూపంలో పుట్టి అరుణ సుందర పర్ణాలై లేత చిగురాటాకుల జొంపాలై సృష్టిలోని పురిటి అందాలు పుణికి పుచ్చుకొంటాడు. ఆ స్వామికి శతవందనాలు.

## ఓం నమః సోభ్యాయచ ప్రతిసర్యాయచ

— పంచమ యజుస్సు

సోభ్యాయచ=పుణ్యపాపజీవిగ పుట్టిన వాడగు శివుని కొఱకు: ప్రతిసర్యాయచ=వివాహ రక్షాబంధనార్హుడగు శివుని కొఱకు; నమః=నమస్సు.

శంభుడు సభ్యుడు. సోభ్యుడు. పుణ్యపాప మిశ్రిత మనుష్యలోక మందు పుట్టినవాడు మహాదేవుడు. చంద్రశేఖరుడు శంకరుడు. కల్యాణగుణుడు. కల్యాణకరుడు. కల్యాణ రక్షాబంధనార్హుడు. వివాహ యోగ్యుడు. పార్వతీ పరిణయార్హుడు. ప్రతిసర్యుడు అయినాడు పరమశివుడు. ఆ కల్యాణమూర్తికి వందనకల్హారాలు.

* *

సాక్షాత్కారము జెందె నవ్వుచు గిరీశానుండు- ధాత్రీధరా
ధ్యక్షాపత్యము ప్రేమ నిర్భర కటాక్షాలోకన ప్రౌఢిమన్
వీక్షించెన్- దరళాక్షియున్ మనమునన్ వ్రీడా ప్రమోదక్షమా
దాక్షిణ్యంబులు సందడింప నిలిచెన్ తత్సన్నిధానంబునన్!

— శ్రీనాథుడు

## ఓం నమో యామ్యాయచ క్షేమ్యాయచ

—షష్ఠ యజుస్సు

యామ్యాయచ=యమలోక పాపులను శిక్షించు దండధరుడై పుట్టినవాడు అగు శివుని కొఱకు; క్షేమ్యాయచ=మోక్షార్హుడై పుట్టినవాడు అగు శివుని కొఱకు; నమః=నమస్సు.

యమలోకంలో శిక్ష విధించే దండధరుడు శివుడు. మోక్ష పదవికి అర్హుడైన పుణ్యమూర్తి కూడా మహానటుడే. అట్టి శంకర స్వామికి అభివాదాలు.

* *

శివాకాంత శంభో శశాంకార్ధమౌళే
మహేశాన శూలిన్ జటాజూటధారిన్
త్వమేకో జగద్వ్యాపకో విశ్వరూప
ప్రసీద ప్రసీద పూర్ణ రూప!

— వేదసార శివస్తోత్రం

## ఓం నమ ఉర్వర్యాయచ ఖల్యాయచ

—సప్తమ యజుస్సు

ఉర్వర్యాయచ=క్షేత్రములో ధాన్యవిశేషమునకర్హుడు అగు శివునికొరకు; ఖల్యాయచ=కళ్ళమునకు అర్హుడైనవాడు అగుశివునికొరకు; నమః=నమస్సు.

మంచి సారవంతమైన పంటభూమి. శివస్వరూపం. శంకరుడు ఖల్య రూపుడు. పంటకళ్ళం పరమేశ్వర స్వరూపం. పరమ సంతోషప్రదం. ధాన్య దర్శనం ఆనందం కారకం కదా! అ ధాన్య విశేషమూర్తికి దండములు.

ఓం నమః శ్లోక్యాయ చావసాన్యాయచ

—అష్టమ యజుస్సు

శ్లోక్యాయచ = వేదమంత్రములందుద్భవించినవాడు అగు శివునికొరకు; అవసాన్యాయచ = వేదాంతమున జనించినవాడు అగుశివునికొరకు; నమః = నమస్సు.

శంకరుడు సుశ్లోకుడు. వేదమంత్రములందు ఉద్భవించిన వేదమూర్తి. ఆ ఉత్తమ శ్లోకునకు అభివాదం. అవసానం వేదాంతం. స్వామి అందే ఉద్భవించాడు. కనుక విశ్వేశ్వరుడు వేదాంత ప్రతిపాద్యుడు. అట్టి వేద వేద్యునకు ప్రణామాలు.

ఓం నమో వన్యాయచ కక్ష్యాయచ

—నవమ యజుస్సు

వన్యాయచ = వృక్షములై వనాన పుట్టినవాడు అగు శివునికొరకు; కక్ష్యాయచ = లతాదులుగా పొదలందు పుట్టినవాడు అగు శివునికొరకు; నమః = నమస్సు.

వామదేవుడు మనోద్భవుడు. వృక్షరూపుడు. అశ్వత్థ నారాయణుడు. బిల్వ శంకరుడు. అన్ని వృక్షాలు స్వామిస్వరూపాలే. అట్టి వనమూర్తికి, పావనమూర్తికి ప్రణామాలు. ఈశ్వరుడు పొదలందుల తాది సుకుమార స్వరూపుడై శోభిస్తుంటాడు. కనుక స్వామిని కక్ష్యుడు అన్నారు. కక్షము అంటే పొద. అట్టి వనస్పతి రూపునకు వందనాలు.

ఓం నమః శ్రవాయచ ప్రతిశ్రవాయచ

—దశమ యజుస్సు

శ్రవాయచ = శబ్దస్వరూపుడు అగు శివునికొరకు; ప్రతిశ్రవాయచ = ప్రతిధ్వని స్వరూపుడు అగుశివునికొరకు; నమః = నమస్కారము.

శంభుడు శబ్ద బ్రహ్మ. శబ్ద స్వరూపుడు. వేదాలు అన్నీ స్వామినుండి జనించాయి. శంకరుడు శబ్దమయుడు. శబ్దాలు ఢమరుకాదులనుండి రూపుదిద్దు కొన్నాయి. శబ్దము ప్రతి శబ్దము కూడా అయిన పరమేశ్వరునకు ప్రణామాలు.

ఓం నమ ఆశుషేణాయ చాఽఽశురథాయచ

— ఏకాదశ యజుస్సు

ఆశుషేణాయచ = శీఘ్రగామినియైన సేనగల సేనానాథుడు అగు శివునికొరకు: ఆశురథాయచ = శీఘ్రగామియైన రథముగలవాడు రథి స్వరూపుడు అగు శివునికొరకు: నమః = నమస్కారము.

ఈశుడు ఆశుషేణుడు. శీఘ్రగామి. మహాసేనా బలోపేతుడు. ఆ త్రిపుర హరుని రథాలు కూడా మహావేగం గలవి. రథిస్వరూపుడైన ఆ పురహరునకు పుష్పాంజలి.

ఓం నమః శూరాయ చావభిందతేచ

—ద్వాదశ యజుస్సు

శూరాయచ = మహాయుద్ధశూరుడు అగు శివునికొరకు: అవభిందతేచ = శత్రు సంహారుడు అగు శివునికొరకు: నమః = నమస్కారము.

శూలి మహాశూరుడు. యుద్ధవీరుడు. రణవిశారదుడు. రాక్షసాంతకుడు త్రిపురహరుడు. శత్రు బలహరుడు. ఆ స్వామికి ప్రణామాలు.

ఓం నమో వర్మిణేచ వరూథినేచ

—త్రయోదశ యజుస్సు

వర్మిణేచ = కంచుకధారియగు శివుని కొరకు: వరూథినేచ = గృహముతో కూడినవాడు అగు శివునికొరకు: నమః = నమస్కారము.

మహాకాలుడు రణవిద్యాకోవిదుడు. కంఠేకాలుడు కంచుకధారి. ఆ స్వామి గృహముతో కూడినవాడు. సేనావాహినిగల భవనమున నుండే ఆ రుద్రమూర్తికి నమస్సులు.

ఓం నమో బిల్మినేచ కవచినేచ

- చతుర్దశ యజుస్సు

బిల్మినేచ = బిలముగల శిరోరక్షకము గలవాడగు శివుని కొరకు: కవచినేచ = శరీరరక్షాకవచము గలవాడగు శివునికొరకు: నమః = నమస్కారము.

ధూర్జటి శిరోజాలు సువిశాలాలు. అవి బిలాలవలె శిరస్సుపై గహనమైన అరణ్యంవలె అనిపిస్తుంది. యుద్ధంలో తన సైన్యానికి ఆ బిలాలవలె కనుపించే శిరోరక్షకం ఆనందప్రదం. శత్రుసేనలకు భయప్రదం. ఆయన శరీర కవచధారి. ఆ జటాధారికి వందనాలు.

ఓం నమః శ్రుతాయచ శ్రుతసేనాయచ

—పంచదశ యజుస్సు

శ్రుతాయచ = వేదప్రసిద్ధుడు అగు శివునికొరకు; శ్రుతసేనాయచ = వేద ప్రసిద్ధమైన సేనగలవాడగు శివునికొరకు; నమః=నమస్కారము.

మహేశ్వరుడు వేద ప్రసిద్ధుడు. వేద స్వరూపుడు. శ్రుతిస్మృతులు స్వామి రూపాలు. ఆ వేదమూర్తికి నమోవాకాలు. శ్రుతులే సైన్యంగాగలవాడు ఆదిశంకరుడు. వేదములు స్వామిసేనలు. వేదమంత్రాలు ప్రాణప్రదాలు. అవే శత్రు సంహారకాలు. శ్రుతసేనగల మహారుద్రునకు శతసహస్ర ప్రణామాలు.

## సప్తమోఽనువాకః

ఓమ్ నమో దున్దుభ్యాయ చాఽహనన్యాయచ
నమో ధృష్ణవేచ ప్రమృశాయచ
నమో దూతాయచ ప్రహితాయచ
నమో నిషంగిణే చేషుధిమతే చ
నమ స్తీక్ష్ణేషవే చాఽయుధినేచ
నమః స్వాయుధాయచ సుధన్వనేచ
నమః స్రుత్యాయచ పథ్యాయచ
నమః కాట్యాయచ నీప్యాయచ

నమః సూద్యాయచ సరస్యాయచ
నమో నాద్యాయచ వైశన్తాయచ
నమః కూప్యాయ చావట్యాయచ
నమో వర్ష్యాయ చావర్ష్యాయచ
నమో మేఘ్యాయచ విద్యుత్యాయచ
నమ ఈధ్రియాయ చాఽఽతప్యాయచ
నమో వాత్యాయచ రేష్మియాయచ
నమో వాస్తవ్యాయచ వాస్తుపాయచ

## సప్తమ అనువాకము

ఓం నమో దుందుభ్యాయ చాఽహనన్యాయచ

— ప్రథమ యజుస్సు

దుందుభ్యాయచ=దుందుభి శబ్దస్వరూపుడు: ఆహనన్యాయచ = దుందుభి తాడనమున జనించిన భీకరధ్వనిరూపుడు అగుశివునికొరకు; నమస్సు.

మహాదేవ డమరుకం మ్రోగుతోంది. అవి సాహిత్య సముద్భవ రావాలు • శివంకరాలు. శివా! ఇది నీ స్వభావం. నీ ప్రభావం. నీకు జోహారులు. హరోం హర! దుందుభి తాడనధ్వని నీవే స్వామీ! ఏమా ధ్వని! ఆ రావ రూపం అంతా నీదే! నీవు శబ్దబ్రహ్మవు. సర్వం నీవేకదా! తాడనోద్భవ ఉత్సాహవర్ధక రూపం నీదే కదా! నమోస్తు !

*　　　　*

జయ జయ శంకర! శత్రుభయంకర!
జయ జయ ప్రథమ పిశాచ వశంకర!
జయ జయ తాండవ సంభ్రమ సుందర!
జయ జయ ధైర్య విచాలిత మందర!

- పుట్టపర్తి నారాయణాచార్యులు

ఓం నమో ధృష్ణవేచ ప్రమృశాయచ

—ద్వితీయ యజుస్సు

*     *

దృష్ణవేచ=పోరులో పారిపోవనివాడు అగుశివునికొరకు; ప్రమృశాయచ=పరసైన్య చరిత్ర పరామర్శకుడు అగు శివునికొరకు; నమస్సు.

యుద్ధంలో వెన్నుచూపని వీరశిఖామణి శివుడు. యుద్ధభటులందరూ రుద్రావతారులే. వీరభద్రావతారులే. పరసైన్యాన్ని పరామర్శించేవాడూ పరమేశ్వరుడే. యుద్ధ నిర్వహణ అంతా రుద్రదేవుని పర్యవేక్షణే.

*     *

జయ జయ శీతలచంద్రాఽభరణా!
జయ జయ కరుణా శరణాఽచరణా !
జయ గగనాంబర! శాత త్రిశూలా !
జయ శుభంకరా! జయ మహాకాలా !

—పుట్టపర్తి నారాయణాచార్య

ఓం నమో దూతాయచ ప్రహితాయచ

— తృతీయ యజుస్సు

దూతాయచ=దౌత్య వ్యవహర్త, గూఢచారి అగు శివుని కొరకు; ప్రహితాయచ=యజమాని అంతరంగిక దూత అగు శివుని కొరకు; నమస్సు.

ధూర్జటి దూత. దూతలకు నేత. దూత కృత్యం నెరపటంలో నేర్పరి. నీలకంఠా! ప్రహితుడవు. నీవు యజమాని చేత పంపబడి లోక క్షేమం కోసం శ్రమిస్తావు. యుద్ధ నివారణం ధర్మ సముద్ధరణం నీ అభిమతం. నీకు ప్రణామాలు.

ఓం నమో నిషంగిణే చేషుధిమతేచ

—చతుర్థ యజుస్సు

నిషంగిణే చ=అయుధోపేత ఖడ్గధారి అగు శివుని కొరకు; ఇషుధిమతేచ= తూణీరము గలవాడు అగు శివుని కొరకు; నమస్సు.

నీవు ఖడ్గయుక్త స్వరూపుడవు. పినాకపాణివి. జీవులలో దుర్గుణాలు దూరం చేయటానికి ఎవరికి ఏ రకమైన అయుధం ఉపయోగించాలో నీకు తెలిసినట్లు మరొకరికి తెలియదుకదా! నీవు ఇషుధినుతివి. నీకు నమస్సుమాలు!

### ఓం నమ స్తీక్ష్ణేషవే చాऽయుధినేచ

— పంచమ యజుస్సు

తీక్ష్ణేషవేచ=తీక్షణ బాణధారి అగు శివుని కొరకు; ఆయుధినేచ=ఆయుధ హస్తుడు అగు శివుని కొరకు; నమస్సు.

పినాకపాణీ! నీవు తీక్ష్ణమైన బాణాలు గల వాడవు. నీ ఆశుగములు మంత్ర యుక్తములు; మహా శక్తివంతములు. బహు సంఖ్యాకములైన ఆయుధాలు గల వాడవు. స్వామీ! నీకు నమోవాకాలు.

### ఓం నమః స్వాయుధాయచ సుధన్వనేచ

— షష్ఠ యజుస్సు

స్వాయుధాయచ=విశిష్ట ఆయుధముగల త్రిశూలి కొరకు; సుధన్వనేచ= విశిష్టమైన ధనువుగల పినాకి కొరకు; నమస్సు.

రుద్రా! భద్రా! నీవు స్వాయుధుడవు. సుధన్వివి. నీవు మహా త్రిశూలం కలిగి 'శూలి' అనిపించుకొన్నావు. నీ కృపవల్లనే మార్కండేయుడు చిరంజీవి కాగలిగాడు. నీ ధనువు పినాకం. పినాకాన్ని ఎదిరించినవాడు 'నభూతో నభవిష్యతి'. నీకు నమస్సుమనస్సులు.

### ఓం నమః స్సృత్యాయచ పథ్యాయచ

— సప్తమ యజుస్సు

స్సృత్యాయచ=పాదచారి అగు శివుని కొరకు; పథ్యాయచ=ప్రౌఢ మార్గ చారి అగు శివుని కొరకు; నమస్సు.

రుద్రదేవా! మహాదేవా! నీవు గహనవనాలలో ఏ కాలిబాటలోనో ఉంటావు. కాలు మోపటానికే దారి లేని చోట నీవు పాద సంచారం చేస్తుంటావు. మహారథాలు నడిచే గొప్ప గొప్ప మార్గాలమీద కూడా పట్టనట్లు మిక్కిలి ఆర్భాటంగా సాగుతుంటావు. మహా రథారూఢుడవై వైభవోపేతంగా ప్రయాణిస్తుంటావు. ఇరుకు దారిపై నడిచేవాడివి నీవే ప్రౌఢమైన రాజమార్గాలపై ఊరేగుతుండేవాడివి నీవే. నీకు నీరాజనాలు.

*   *

నీ కారుణ్యము సాటి చెప్పెదను కానీ నిక్క మూహింపగా
నీ కారుణ్యము సాటి దాని కదియే నీ యీ కృపాలేశ మీ
నాకున్ దోచెను కించిదేతదుదితానందంబు దైనందిన
ప్రాకట్యంబునుపొందు జేసి నను సంరక్షింము విశ్వేశ్వరా!

— విశ్వనాథ సత్యనారాయణ

## ఓం నమః కాట్యాయచ నీప్యాయచ

— అష్టమ యజుస్సు

కాట్యాయచ = అల్ప ప్రవాహ రూపధారి అగు శివుని కొరకు; నీప్యాయచ = జలపాత ప్రవాహ రూపధారి అగు శివుని కొరకు; నమస్సు.

గంగాధరా! జలరూపంలో ఎన్ని విధాలుగా సాక్షాత్కరిస్తావు! అద్భుతం! అద్భుతం! నీ లీలలు. అనూహ్యం కదా! చిన్న చిన్న సెలయేరులలో పిల్లకాలువలలో కుప్పించి నీవే సాక్షాత్కరిస్తావు. ఉన్నత పర్వతాగ్ర వీధులనుండి అధోముఖంగా దూకే జలపాతాల రూపంలోను నీవే సాక్షాత్కరిస్తావు! నీ స్వరూపాలు అనంతాలు. నీకు నమస్కారాలు.

## ఓం నమః సూద్యాయచ సరస్యాయచ

—నవమ యజుస్సు

సూద్యాయచ = బురద నీటి రూపుడు అగు శివుని కొరకు; సరస్యాయచ = సరోవర జలస్వరూపుడు అగు శివుని కొరకు; నమస్సు.

శంకరా! గంగా మనోహరా! నదీ కుల్యలందే కాక కర్దమ ప్రదేశాలలోని జలదేవతవు నీవే. గంగా మనోహరా! నమో వాకాలు.

*                *

భాగీరథీ స్నానఫల మబ్బునటె! నీదు
కెరటాల గాలి యొక్కింత సోక!
యమున ముంగిట వత్సరము తపస్సటె! నీదు
జలములు నెత్తిపై జల్లుకొన్న
నర్మదాతటిని యజ్ఞము జేసినట్లె! నీ
వారి లోపల ఒక్కసారి మునుగ
సకల తీర్థాలలో జలకమాడిన యట్లె!
నీలోని గ్రుక్కెడు నీళ్ళు త్రావ

హరిహరుల దివ్య తేజస్సు నందినావు
'కృష్ణపై' 'వేణి'పై ప్రవహించినావు
తెలుగు బిడ్డల ఆశీర్వదింపుమమ్మ
ఆర్తజన కల్పవల్లి! కృష్ణమ్మ తల్లి!

—కరుణశ్రీ

ఓం నమో నాద్యాయచ వైశంతాయచ

—దశమ యజుస్సు

నాద్యాయచ=నదీజలరూపుడు అగు శివుని కొరకు; వైశంతాయచ=చిన్న చెరువులోని జలరూపుడు అగు శివుని కొరకు; నమస్సు.

నందివాహనా! నీ గంగా ప్రియత్వం కొనియాడదగింది. నీవు నదీ మూర్తివి. తటాక మూర్తివి. నీవు నదులయందు ప్రకాశిస్తుంటావు. అల్ప జలరూపంలోనూ ప్రకాశిస్తుంటావు. జలం ఎన్ని రూపాలలో ఉంటే అన్నిచోట్లా నీవుంటావు. నీకు నమస్సులు.

*                *

మందాకినీ సలిల చందన చర్చితాయ
నందీశ్వర ప్రమథనాథ మహేశ్వరాయ
మందార ముఖ్య బహుపుష్ప సుపూజితాయ
తస్మై మకారాయ నమశ్శివాయ!

— శివ పంచాక్షరీ స్తోత్రమ్

ఓం నమః కూప్యాయ చావట్యాయచ

— ఏకాదశ యజుస్సు

కూప్యాయచ=కూప జలరూపుడు అగు శివుని కొరకు; అవట్యాయచ= గోతులలోని జలరూపుడు అగు శివుని కొరకు; నమస్సు.

అవిగో! నూతులు: బావులు! నడబావులు. పాతాళాలలో కనిపించే లోతైన కూపాలు! అన్నిటిలోనూ నీవే స్వామీ! జలరూపుడ వగు నీకు సహస్ర వందనాలు.

ఓం నమో వర్ష్యాయ చావర్ష్యాయచ

— ద్వాదశ యజుస్సు

వర్ష్యాయచ=వర్ష జలరూపుడు అగు శివుని కొరకు; అవర్ష్యాయచ=వర్షాధారము కాని జలరూపుడు అగు శివుని కొరకు; నమస్సు.

దేవా! నీవు వర్షరూపుడవు. వర్షంతో హర్షం కలిగించి ప్రజలకు జలం సమృద్ధిగా ప్రసాదిస్తావు. ఆకాశతోయం నీకత్యంత ప్రియం. జలప్రియా! నీదర్శనం వర్షరూపంలో మాకు ప్రత్యక్షమై సుఖశాంతులు కలగాలి. వర్ష నిరపేక్ష జలరూపం కూడా నీదే. వర్షం లేకుండా జలం సృష్టించి అద్భుతం ఆనందం కలిగిస్తావు! నీవు తలచుకొంటే ఎండైనా సాక్షాత్కరించి సంతోషం కూరుస్తావు. నమోస్తు.

ఓం నమో మేఘ్యాయచ విద్యుత్యాయచ

— త్రయోదశ యజుస్సు

మేఘ్యాయచ = మేఘాలలోని జలస్వరూపుడగు శివుని కొరకు; విద్యుత్యా యచ = తటిత్తుతో ఆ రూపమే తానై చరించు శివుని కొరకు; నమస్సు.

మహా తేజస్వరూపా! ఆకాశ వీధులలో విహరించే మేఘాలలోని జలరూపం నీదే నీలకంఠా! మేఘం నీవే. మేఘాలే నీ వ్యోమకేశాలు. అవి ఎంత శీతలాలు! ఎంత హర్ష ప్రదాయి! మేఘ మార్గంలో తటిల్లతలు జిగేల్ మంటున్నాయి. ఆ విద్యుత్తులో ప్రకాశించేదీ నీవే. దేవా! నీవు ఎంత మనోహర మూర్తివి! విద్యున్మూర్తీ! విశ్వేశ్వరా! నమోస్తు!

ఓం నమ ఈధ్రియాయ చాఽఽతప్యాయచ

—చతుర్దశ యజుస్సు

ఈధ్రియాయచ = శరన్మేఘములోని శివుని కొరకు; ఆతప్యాయచ = ఆతపము తోడి జలరూపుడగు రుద్రుని కొరకు; నమస్సు.

చంద్రశేఖరా! శరత్కాలమేఘసుందరా! ఎంతనిర్మలంగా దర్శనమిస్తున్నావు! అది వర్షమేఘం లేమెండ. ఇంద్రధనుస్సు సోయగం. ఈశా! ఆతపంతో వర్షించిన జలబిందు సౌందర్యం నీది. ఎంత మనోజ్ఞ దృశ్యం ! విశ్వ సౌందర్య వీచిక అది !

ఓం నమో వాత్యాయచ రేష్మియాయచ

—పంచదశ యజుస్సు

వాత్యాయచ = ఈదురుగాలిలోని జలరూప శివునికొరకు; రేష్మియాయచ = ప్రళయకాల పాషాణవృష్టి రూపుడగు శివుని కొరకు; నమోస్తు.

గాలివీస్తున్నది. వర్షబిందువులు పడుతున్నాయి. ఇది నీ రూప విశేషం. అదిగో! అది పెద్ద వర్షం. రాళ్ళ వర్షం. కఠినపాషాణ వర్షం. ప్రళయకాల వర్షం. ఆ రూపంకూడా నీదే కదా.

ఓం నమో వాస్తవ్యాయచ వాస్తుపాయచ

—షోడశ యజుస్సు

వా స్తవ్యాయచ=గో అశ్వముల ధనరూపములో ధర్మా కార్యరూపములో నుందు శివునికొరకు; వాస్తుపాయచ = గృహక్షేత్ర భూమిపాలకుడు అగు శివుని కొరకు; నమస్సు.

శివా! భవా! శాంతస్వరూపా! శంకరా! గొల్లపల్లెలు మనోజ్ఞంగా ఉన్నాయి. అశ్వబృందాలు అందంగా ఉన్నాయి. ఈ మనోజ్ఞదృశ్యాలు నీ స్వరూపము మహా దేవా! పశుపతీ! పశుపాలకా! నమస్సు.

### అష్టమో஽నువాక్య

ఓమ్ నమ స్సోమాయచ రుద్రాయచ
నమ స్తామ్రాయ చారుణాయచ
నమః శంగాయచ పశుపతయేచ
నమ ఉగ్రాయ చ భీమాయచ
నమో అగ్రేవధాయచ దూరేవధాయచ
నమో హన్త్రేచ హనీయసేచ
నమో వృక్షేభ్యో హరికేశేభ్యః
నమస్తారాయ
నమః శంభవేచ మయోభవేచ
నమః శంకరాయచ మయస్కరాయచ
నమః శివాయచ శివతరాయచ
నమః తీర్థ్యాయచ కూల్యాయచ
నమః పార్యాయ చావార్యాయ చ
నమః ప్రతరణాయ చోత్తరణాయచ

నమ ఆతార్యాయ చాఽఽలాద్యాయచ
నమః శష్ప్యాయచ ఫేన్యాయచ
నమః సికత్యాయచ ప్రవాహ్యాయచ

## అష్టమ అనువాకము

ఓం నమః సోమాయచ రుద్రాయచ

—ప్రథమ యజుస్సు

సోమాయచ = ఉమాసహితుడైన శంకరుని కొరకు; రుద్రాయచ=రోదన దుఃఖమును పోగొట్టు శంకరుని కొరకు; నమోస్తు.

హే ఉమానాథా! జగన్నాథా! అనాథనాథా! శంకరా! ఉమాదేవితో వృషభ వాహనంపై వచ్చి నాకు దర్శనమిచ్చావా. ఓ పుణ్య దంపతులారా! మాతాపిత లారా! ప్రణవ ప్రణామాంజలులు. సంసార కూపంలోపడి లోకం రోదిస్తోంది. ఆ రోదనం దుర్భరంగా వుంది. ఆ దుఃఖాన్ని దూరంచేయ సమర్థుడవు నీవే. ఓ రుద్రా! గుణభద్రా! దయాసముద్రా! నీ పాద పద్మాలకు ప్రణామ శతాలు.

* *

వాగర్థా శివ సంపృక్తౌ
వాగర్థ ప్రతిప త్తయే
జగతః పితరౌ వందే
పార్వతి పరమేశ్వరౌ!

— కాళిదాసు

ఓం నమ స్తామ్రాయ చారుణాయచ

— ద్వితీయ యజుస్సు

తామ్రాయచ = మిక్కిలి ర క్తవర్ణుడైన ఉదయ ఆదిత్య శంకరుని కొరకు; అరుణాయచ=ఉదయానంతర ఆదిత్య శంకరుని కొరకు; నమస్సు.

నీవు ఉదయభాస్కరుడవై తామ్రవర్ణంలో బహు మనోహరంగా ఉంటావు. దేవగణం పసుపుకుంకుమలతో పూజిస్తున్నది. నీవు ఆదిత్యుడివలె ఉదయానంతరం రక్తవర్ణం కొంచంతగ్గి అరుణకాంతులు ప్రసరిస్తున్నావు! కడు అందంగా ఉన్నావు. ఈశ్వరా! సత్య ఆదిత్యా! నీకు నమోస్తు!

### ఓం నమః శంగాయచ పశుపతయే చ

—తృతీయ యజుస్సు

శంగాయచ=సుఖము పొందించు శంకరుని కొరకు; పశుపతయేచ=పశు పాలకుడగు శంకరుని కొరకు; నమస్సు.

శివంకరా! నీవు లోకానికి పరమ సుఖం ప్రసాదిస్తున్నావు. ప్రజలను పరమ ప్రీతితో పరిపాలిస్తున్నావు. నీవు సుఖస్వరూపుడవు. సుఖప్రదాతవు. నీవు పశుపతివి. మేము పశువులం. బోళా శంకరా! పరమదయాకరా! ప్రణామాలు.

* *

నీవు దయాపయోనిధివి- నిన్ను నుతించిన కల్గు భక్తి- నీ
చే వరవీరశైవరతి చేకురు- నీ కయి యిత్తు కబ్బముల్-
నీ వలనన్ కృతార్థత జనించును- నీకు నమస్కరింతు- ఈ
భావము నందునుండి నను బాయకుమీ! బసవయ్య! వేడెదన్-

— పాల్కురికి సోమన

### ఓం నమ ఉగ్రాయచ భీమాయచ

—చతుర్థ యజుస్సు

ఉగ్రాయచ=విరోధి సంహారార్థమై క్రోధము వహించిన రుద్రుని కొరకు; భీమాయచ=కేవలము దర్శన మాత్రముతోనే చూపులతోనే శత్రువులను భయపెట్టు రుద్రుని కొరకు; నమస్కారము.

ఉగ్రమూర్తీ! భీమశంకరా! సదాశివా! నీకు ఆగ్రహం ఏమిటి? కానీ పశుతుల్యులైన మమ్ము భయపెట్టి మంచిదారిలో నడిపించటానికే ఈ ఉగ్రత్వం. ఆగ్రహత్వం.

అంతా మా కోసమే స్వామీ! నీవు భీమరూపం దాల్చి దర్శన మాత్రంచే అహంకారులను భయపెడతావు. భీమశంకరా! శివా! నమస్కారం!

ఓం నమో అగ్రేవధాయచ దూరేవధాయచ

— పంచమ యజుస్సు

అగ్రే వధాయచ=అగ్ర భాగములోని శత్రువులను వధించు శివుని కొరకు; దూరేవధాయచ=దూరమున గల శత్రువులను కూడా వధించు ఉగ్రుని కొరకు: నమస్సు.

ఉగ్ర స్వరూపా! భీమరూపా! ధర్మచ్యుతులైన మదాంధులు అహంకారంతో విర్రవీగుతూంటారు: అట్టివారు నీ ఎదుట బడినా వధింపబడతారు. లేక పారిపోయి దూరాన దాగుకొనినా వధింపబడతారు. విరోధి మూక సమీపంలో ఉన్నా దూరంలో ఉన్నా అనాయాసంగా సంహరించే స్వామీ! నీకు వందనం.

* *

సర్వత్ర మాం రక్షతు విశ్వమూర్తిః
జ్యోతిర్మయానంద ఘనశ్చిదాత్మా
అణోరణీయా నురు శక్తి రేకః
స ఈశ్వరో పాతు భయాదశేషాత్

ఓం నమో హంత్రేచ హనీయసేచ

— షష్ఠ యజుస్సు

హంత్రేచ=హంత రూపుడగు రుద్రుని కొరకు; హనీయసేచ=సంహరణ కాలములో అతిశయముగా వైరులు అందరిని చంపునట్టి రుద్రుని కొరకు; నమస్సు.

మహాకాల స్వరూపా! కాలాంతకా! నీవు ప్రళయ కాలంలో హంత స్వరూపుడవు! సర్వ సంహార కాలమందు జగత్తును సంహరించువాడవు నీవే! కర్షకుడివలె విశ్వాన్ని దున్ని పండించు బాబూ! కానీ మేము ఆ ప్రళయ దృశ్యాలు చూడలేము. అవి చూపకుండ ఉపసంహరింపుము తండ్రీ! నీకు ప్రణామాలు.

*　　　　*

కల్పాంత కాలోగ్ర పటుప్రకోప
స్ఫుటాట్ట హాసోచ్ఛవితాండ కోశః
ఘోరారి సేనార్ణవ దుర్నివారః
మహాభయా ద్రక్షతు వీరభద్రః!

## ఓం నమో వృక్షేభ్యో హరికేశేభ్యః

— సప్తమ యజుస్సు

హరికేశేభ్యః = హరిత పర్ణ కేశుడగు శంకరుని కొరకు; వృక్షేభ్యః = కల్ప ద్రుమాది వృక్షరూపుడగు శంకరుని కొరకు; నమస్సు.

శంకరా! హరికేశా! వృక్షాలకు హరిత పర్ణాలవలె శివా! నీ కేశాలు హరిత వర్ణం కలిగి కల్పవృక్ష పత్రాలవలె శోభాయమానంగా ఉన్నాయి. ఒక్కొక్క వృక్షం నీ రూపమే. నీవు భక్త కల్పద్రుమానివి. భక్త మందారానివి. సుజన పారిజాతానివి. నీకు అభివందనం.

## ఓం నమస్తారాయ

— అష్టమ యజుస్సు

తారాయ = ప్రణవ ప్రతిపాద్యుడగు పరమశివుని కొరకు; నమః = నమస్కారము,

ప్రణవ ప్రతిపాద్యా! ఓంకార మూర్తీ! శంకరా! అన్ని శబ్దాలలో శ్రేష్ఠమైన ఓంకార శబ్దం నీవు. నీ డమరుకం నుండి శబ్దం పుట్టింది. అదే ఓంకారం.

*　　　　*

ఓంకార మంత్ర సంయుక్తం
నిత్యం ధ్యాయంతి యోగినః
కామదం మోక్షదం తస్మైః
ఓంకారాయ నమోనమః!

ఓం నమః శంభవేచ మయోభవేచ

—నవమ యజుస్సు

శంభవేచ=విషయసుఖ ప్రదాతయగు శంభుని కొరకు; మయోభవేచ=మోక్ష సుఖ ప్రదాతయగు శివుని కొరకు; నమః=నమస్కారము.

శంభూ! స్వయంభూ! ప్రభూ! నీ వల్ల లౌకిక సుఖాలు లభ్యమవుతున్నాయి. సంసారంలో మగ్నమవుతున్నారు. కాదని ఉన్నత స్థాయికి వెళితే మోక్ష సుఖం ప్రసాదించేది కూడా నీవే. నీవు కానిది ఏమున్నది ప్రభూ! నమస్కారము.

*                    *

భూతేత! భూతాత్మ! భూత భావనరూప!
దేవ! మహాదేవ! దేవ వంద్య!
ఈ లోకముల కెల్ల ఈశ్వరుండవు నీవ!
బంధ మోక్షములకు ప్రభుడవీవ! ....

— పోతన

ఓం నమః శంకరాయచ మయస్కరాయచ

— దశమ యజుస్సు

శంకరాయచ=పైతృ సంబంధిత లౌకిక సుఖాలు కలిగించువాడగు శంకరుని కొరకు; మయస్కరాయచ=శాస్త్ర సమ్మత జ్ఞానరూప మోక్ష సుఖదాతయగు శివుని కొరకు; నమః=నమస్కారము.

శంకరా! శుభంకరా! నీవు శంభుడవే కాదు శంకరుడవు. పితృలోక సంబంధమైన సుఖాలు కలుగజేస్తావు! శాస్త్ర చోదితమైన మోక్ష సుఖం కలుగజేస్తావు. శంకరా! మయస్కరా! స్థిరయశస్కరా! పరమేశ్వరా! నీకు సహస్ర నమస్కారాలు.

## ఓం నమః శివాయచ శివతరాయచ

—ఏకాదశ యజుస్సు

శివాయచ=కల్యాణరూపుడగు శంకరుని కొరకు; శివతరాయచ=భక్తులను కూడా నిష్కల్మషులను చేయువాడగు పరమ శివుని కొరకు; నమః=నమస్కారము.

శివా! నీవు కల్యాణరూపుడవు. కల్యాణ ప్రదాతవు. మంగళ స్వరూపుడవు. మంగళ ప్రదాతవు. శాంత మూర్తివి శాంతిప్రదాతవు. నిష్కళంక నిర్మల నిశ్చల నిష్కల్మష మూర్తివి. నిరంజన జ్ఞాన శేఖరుడవు. సదాశివా! సాష్టాంగ నమోవాకాలు.

*                *

శివం శాంతం జగన్నాథం లోకానుగ్రహ కారణమ్
శివమేక పరం వందే శివాయాస్య నమోనమః!

— పంచాక్షరీ స్తోత్రం

## ఓం నమ స్తీర్థ్యాయచ కూల్యాయచ

— ద్వాదశ యజుస్సు

తీర్థ్యాయచ=కాశీప్రయాగాది తీర్థ సన్నిహితుడగు శివుని కొరకు; కూల్యాయచ=తీర్థ స్థానాలలో ప్రతిష్ఠిత లింగరూపుడగు శివుని కొరకు; నమః=నమస్కారం

పుణ్యతీర్థ స్వరూపా! పుణ్యప్రదాతా! నీవు కాశీ ప్రయాగాది తీర్థాలలో అవతరించి మహిమలు చూపిస్తుంటావు. తీర్థ పాదుడవు. గంగాధరా! నీవే గంగామూర్తివి. అభిషేక ప్రియుడవు. గంగాపతివి. తీర్థంకరుడవు. తీర్థ సన్నిహితుడవు. పుణ్యనదీ తీర ప్రతిష్ఠిత శివమూర్తీ! కాశీ విశ్వనాథా! నీవు నదీ తీరాలలో విహరిస్తుంటావు. సాలగ్రామ రూపంలో నదీ నదాలలో ఓలలాడుతుంటావు. విశ్వేశ్వరా! వినతులు.

*                *

గంగా తరంగ కమనీయ జటా కలాపం
గౌరీ నిరంతర విభూషిత వామభాగం
నారాయణప్రియ మనంగ మదాపహారం
వారాణసీ పురపతిం భజ విశ్వనాథమ్!

## ఓం నమః పార్యాయ చావార్యాయచ

— త్రయోదశ యజుస్సు

పార్యాయచ=సంసార పరతీరమున ముముక్షువులకు ధ్యేయమైన వాడు అగు శంకరుని కొరకు; అవార్యాయచ=సంసార మధ్యమున కామ్యప్రదుడగు శంభుని కొరకు; నమః=నమస్కారము.

పరమ శివా! నీవు ముముక్షుజన ధ్యేయ రూపుడవు. సంసార పారావారము అవతల ఒడ్డున ఉండు వారికి అండవు. సంసార మధ్య జీవులకు కామ్య ఫలాలు ప్రసాదించి వారిని ఒడ్డు జేర్చువాడవు. అభీప్సితాలు తీర్చి మానవుల మనసులు హరించు వాడవు. నీకు సహస్ర వందనాలు.

* *

ముక్త్యర్థ్యంబులు నీ పదాంకముల వంపుల్ పూల పూజింతు- సం
సక్త్యాశాభయ లోభ మోహ మద తృష్ణా వల్లికల్ త్రెంతు- ధీ
శక్త్యుత్సాహములన్ దమః ప్రకృతిలో సారింతు జ్యోతిర్లతల్
భక్త్యావేశ మొసంగితేని ఒకడప్పా! నాకు విశ్వేశ్వరా!

— విశ్వనాథ సత్యనారాయణ

## ఓం నమః ప్రతరణాయ చోత్తరణాయచ

— చతుర్దశ యజుస్సు

ప్రతరణాయచ=పాపహరుడు మంత్రజప స్వరూపుడగు మహేశ్వరుని కొరకు; ఉత్తరణాయచ=ఉద్ధరించుటకు తత్త్వజ్ఞాన రూపము దాల్చిన ఈశ్వరుని కొరకు; నమః=నమస్కారము.

శివమూర్తీ! శంకర స్వామీ! నీవు ప్రకృష్ట మంత్ర తంత్ర స్వరూపుడవు. నీవు పాపతరణ హేతు భూతుడవు. జపతపాది లక్ష్య భూతుడవు. నీవు తత్త్వజ్ఞాన మూర్తివి. తత్త్వ సాధనలో నిమగ్నులైన యోగులకు సంసారోద్ధరణలో కారణ భూతుడవు. నీకు ప్రణామాలు.

* *

మూడు మూర్తులకును మూడు లోకములకు
మూడు కాలములకు మూల మగుచు
భేదమగుచు తుది అభేదమై యొప్పారు
బ్రహ్మ మనగ నీవ! ఫాలనయన!

— పోతన

## ఓం నమ ఆతార్యాయ చాఽఽలాద్యాయచ

—పంచదశ యజుస్సు

ఆతార్యాయచ=పునర్జన్మకు కామ్య ఫలములనిచ్చు శివుని కొరకు; ఆలాద్యాయచ=కర్మఫల ప్రదుడు కర్మప్రేరకుడగు శివుని కొరకు; నమః=నమస్కారము.

మహాదేవా! దయామయా! నీవు కామ్యకర్మానుష్ఠానం చేయించేవాడవు. ఆగమ రూపుడవు. కామ్య కర్మ ఉపేక్షకు కూడ పునరాగమన అవతారమూర్తివి. నీవు కామ్య ఫలప్రదుడవు. నీవు సంపూర్ణ కర్మఫలం పొందు జీవునకు ప్రేరకుడవు. స్వామీ! నీకు సహస్ర నమస్సులు.

## ఓం నమః శష్ప్యాయచ ఫేన్యాయచ

—షోడశ యజుస్సు

శష్ప్యాయచ=పవిత్ర గంగాతీర కుశాంకురాది తృణరూపుడుగు శివుని కొరకు; ఫేన్యాయచ=నది నురుగు రూపము దాల్చిన శివుని కొరకు; నమః=నమస్కారము.

గంగా మనోహరా! ఫేనస్వరూపా! కుశరూప శోభితా! కుశపత్ర పుష్ప పూజితా! కుశప్రియా! గంగానదీ తీర భూములలోని దర్భలు నీకు చాలా ఇష్టం. అందు లేత దర్భలు మరీ ఇష్టం. దర్భపూజకు పొంగి పోతావు. ఆ దర్భ రూపం నీదే. నదీ ఫేనం కూడా నీవే. ఆ స్వచ్ఛత శుభ్రత మనోహరం. స్వామీ నమోస్తు.

* *

దేవా! దేవ కిరీట సుషమా దేదీప్యమానాంఘ్రి రా
జీవా! గంగాతరంగ శీతల దయా జేగీయమానోల్లస
ద్భావా! ప్రేల్లిత భోగి భోగమణి శోభా భాసమానామల
గ్రీవా! పావన కీర్తి! సత్త్వమయమూర్తీ! బాలకోటీశ్వరా!

—కరుణశ్రీ

ఓం నమః సికత్యాయచ ప్రవాహ్యాయచ

—సప్తదశ యజుస్సు

సికత్యాయచ = ఇసుకనేల రూపము దాల్చిన శివుని కొరకు; ప్రవాహ్యాయచ = నదీప్రవాహరూపుడగు శివుని కొరకు; నమః = నమస్కారము.

గంగాప్రియా! గంగాతీర వాసా! సైకత లింగ స్వరూపా నీవు సైకత లింగ రూపంలో రామేశ్వరంలో వెలిశావు. హనుమదాదులకు జ్ఞానోదయం కలిగించావు. సైకతంలో వెలిసి పూజలందుకొన్నావు. మెరక నేలలూ గులక నేలలూ నీవే. ప్రతి రాయి రప్ప నీవే దేవా! నీవు విశ్వరూపధారివి కదా! నదీ ప్రవాహమూ నీవే. అలలూ నీవే. శివా నమస్సులు!

## నవమోఽనువాకః

ఓమ్ నమ ఇరిణ్యాయచ ప్రపథ్యాయచ
నమః కింశిలాయచ క్షయణాయచ
నమః కపర్దినేచ పులస్తయే చ
నమో గోష్ఠ్యాయచ గృహ్యాయచ
నమ స్తల్ప్యాయచ గేహ్యాయచ
నమః కాట్యాయచ గహ్వరేష్ఠాయచ
నమో హ్రదయ్యాయచ నివేష్ప్యాయచ
నమః పాంసవ్యాయచ రజస్యాయచ

నమః శుష్క్యాయచ హరిత్యాయచ
నమో లోప్యాయ చోలప్యాయచ
నమ ఊర్వ్యాయచ సూర్మ్యాయచ
నమః పర్ణ్యాయచ పర్ణశద్యాయచ
నమోఽపగురమాణాయ చాభిఘ్నతేచ
నమ ఆక్ఖిదతేచ ప్రక్ఖిదతేచ
నమో వః కిరికేభ్యో దేవానాగ్ం హృదయేభ్యః
నమో విక్షీణకేభ్యః నమో విచిన్వత్కేభ్యః
నమ ఆనిర్హతేభ్యః నమ ఆమీవత్కేభ్యః

## నవమ అనువాకము

ఓం నమ ఇరిణ్యాయచ ప్రపథ్యాయచ

—ప్రథమ యజుస్సు

ఇరిణ్యాయచ=చవిటి నేలయందు పుట్టిన పదార్థ స్వరూపుడగు హరుని కొరకు; ప్రప్రథ్యాయచ=జనులు నడుచు మార్గమున పుట్టు పదార్థ స్వరూపుడగు శివుని కొరకు; నమః=నమస్కారము.

అష్టమూర్తీ! శివమూర్తీ! నీవు పృధ్వీ మూర్తివి. పృధ్వీపతివి. అదిగో! పృధ్వి ఒకచోట చవిటినేలగా కనిపిస్తోంది. ఆ భూమిలో పంటలు లేవు. అది ఒక రకం నేల. అది కూడ ఈశ్వర స్వరూపమే. అదిగో! పదిమంది అటు నడిచి వెళుతున్నారు. అనేకులచే సేవింపబడి మార్గరూపం దాల్చింది. ఆ మార్గంలో పుట్టిన తేజస్సు ఈశ్వరునిదే! నీకు నమస్కృతి.

ఓం నమః కిగ్ం శిలాయచ క్షయణాయచ

— ద్వితీయ యజుస్సు

కింశిలాయచ=గరస రాల ప్రదేశ స్వరూపుడగు హరుని కొరకు; క్షయణాయచ=నివాస ప్రదేశ స్వరూపుడగు శివుని కొరకు; నమః=నమస్కారము.

శివా! అల్పమైన ప్రతి రాయి శివలింగమే. నివాసయోగ్య ప్రదేశ భూమి నీ రూపమే శివా! గరపనేల నీవే. ప్రజల కాపురస్థలము నీవే. నీకు జోహారులు.

### ఓం నమః కపర్దినేచ పులస్తయేచ

—తృతీయ యజుస్సు

కపర్దినేచ=జటాబంధ శోభితుడగు పరమశివుని కొరకు; పులస్తయేచ=భక్తుల ముందు ప్రత్యక్షమగు శంకరుని కొరకు; నమః= నమస్కారము.

కపర్దీ! కారుణ్యమూర్తీ! జటా బంధనం ధరించి జటాజూట శోభాయమానుడవై జగాలను చల్లగా చూస్తున్నావు. జనులకు జలం ప్రసాదిస్తున్నావు. పరమేశ్వరా! భక్తవత్సలా! భక్తులు చేతులు జోడించి ఆర్తితో నిన్ను ప్రార్థన సేయగానే ఎట్టయెదుట ప్రత్యక్షమవుతావు. బాధలు దూరం చేస్తావు. హే మృత్యుంజయా! నమస్కార శతసహస్రాలు.

* *

కలాభ్యాం చూడాలంకృత శశికలాభ్యాం నిజతపః
ఫలాభ్యాం భక్తేషు ప్రకటిత ఫలాభ్యాం భవతుమే
శివాభ్యాం అస్తోక త్రిభువన శివాభ్యాం హృదిపున
ర్భవాభ్యాం ఆనంద స్ఫురదను.భవాభ్యాం నతిరియమ్.

— శంకరాచార్య

### ఓం నమో గోష్ఠ్యాయచ గృహ్యాయచ

— చతుర్థ యజుస్సు

గోష్ఠ్యాయచ=గోశాల వస్తుస్వరూపుడగు పశుపతి కొరకు; గృహ్యాయచ=గృహ వస్తు వాస్తు సంబంధిత వివిధ శోభాస్వరూపుడగు సాంబమూర్తి కొరకు; మః =నమస్కారము.

ఈశ్వరా! గోపాలదేవా! గోష్ఠాలు గోవులు గోశాలలు గోపికలు గోపాలురు అన్నీ నీ స్వరూపాలే. నీవు వృషభ వాహనుడవే కాక వృషకేతనుడవు. గోవులన్నా వృషభాలన్నా నీకెంత మక్కువ. అవిగో! మా గృహాలు. మా ఆశ్రమాలు. ఆశ్రమాలు. మా గృహాలు హాయిగా ఉన్నాయంటే నీవే కారణం. గృహ రూపం కూడా నీదే. నీవే గృహమేధివి. నమస్కారం.

ఓం నమ స్తల్ప్యాయచ గేహ్యాయచ

—పంచమ యజుస్సు

తల్ప్యాయచ=తూలికా తల్పములు మంచములు శయనించునట్టి పార్వతీ పతి కొరకు; గేహ్యాయచ=మహోన్నత ప్రాసాద విహారియగు శివుని కొరకు; నమః= నమస్కారము.

స్వామీ! ఇదిగో! ఇక్కడ తల్పం వేశాను. గృహంలో ప్రక్కపరిచాను. ఈ హంసతూలికా తల్పంపై శయనించు తండ్రీ! ఈ తల్పం నీదే. దయచేయండి పరమ సంతోషం. స్వామీ! శయనించావా! శంకరా! విశ్రాంతి తీసుకో! వింజామర వీస్తాను. ఇదిగో! ప్రాసాదం. పరమసుందరంగా నీకోసం నిర్మించాను. అక్కడ ఉన్నది నీవే. ఇక్కడ ఉన్నది నీవే. నీకు ప్రణామాలు.

ఓం నమః కాట్యాయచ గహ్వరేష్ఠాయచ

—షష్ఠ యజుస్సు

కాట్యాయచ=దుర్గమారణ్య విశేష పదార్థ స్వరూపుడగు శివుని కొరకు; గహ్వరేష్ఠాయచ=గిరిగుహాదులలో వసించు శంకరునికొరకు; నమః=నమస్కారము

స్వామీ! దుర్గమమైన అరణ్యంలో ఉండేది నీవే. కొండ గుహలలో ఉండేది నీవే. నీవు దారుకావన విహారివి. హిమగిరి నివాసివి. స్వామీ! నీవు లేనిచోటు ఏమున్నది ప్రభూ! నీకు నమస్సులు!

* *

అచ్చపు నీలవర్ణ దృషదావళి నల్లని కల్వలే కడుం
పచ్చనిరాలు బిల్వనవ పత్రములే! అరుణాశ్మ ఖండముల్
విచ్చిన యెఱ్ఱదామరలె! విశ్వపతీ! విరసోపలంబు లె
ట్లచ్చెదలయ్యె నీకు! అవి యందునె గంధ మృదుత్వ శైత్యముల్!

—ధూర్జటి

ఓం నమో హ్రదయ్యాయచ నివేష్ప్యాయచ

—సప్తమ యజుస్సు

హ్రదయ్యాయచ=అగాధ జలస్వరూపుడగు శివుని కొరకు; నివేష్ప్యాయచ= నీహార జలస్వరూపుడగు గంగాధరుని కొరకు; నమః=నమస్కారము.

అభిషేక ప్రియా! అగాధ జలం నీవే. నీహార జలం నీవే. సకల గంగా స్వరూపాలు నీవే. నీకు అనేక నమస్సులు.

* *

జలకంబుల్ రసముల్ ప్రసూనములు వాచా బంధముల్ వాద్యముల్
కలశబ్ద ధ్వను— లంచితాంబర మలంకారంబు-దీప్తుల్ మెఱుం
గులు— నైవేద్యము మాధురీ మహిమగా గొల్తు న్నినుం భక్తి రం
జిల దివ్యార్చన గూర్చి నేర్చిన క్రియన్ శ్రీ కాళహస్తీశ్వరా!

—ధూర్జటి

ఓం నమః పాగ్ంసవ్యాయచ రజస్యాయచ

— అష్టమ యజుస్సు

పాంసవ్యాయచ=పరమాణుస్థిత రూపుడగు పరమేశుని కొరకు; రజస్యాయచ=ధూళి ధూసర అంతర్యామితుడగు శివుని కొరకు; నమోస్తు.

శివా! పరమేశ్వరా! అంతట అణువణువునా ఉంటావు. ఒక్కొక్కసారి నీవు పరమాణు రూపంలో ప్రత్యక్షమవుతావు. పరమాణువులోని మహాశక్తి నీశక్తియే. రజస్సు దుమ్ము ధూళి కూడ నీవే. అన్నిటిలోను నీవున్నావు. నీకు వందనాలు.

ఓం నమః శుష్క్యాయచ హరిత్యాయచ

— నవమ యజుస్సు

శుష్క్యాయచ=శుష్క-కాష్ఠ స్థితరూపుడగు హరుని కొరకు; హరిత్యాయచ= పచ్చి కొమ్మలలో ఉండువాడగు శంకరుని కొరకు; నమోస్తు.

శివా! నీ విశ్వరూప వివరణ చూచి విస్తుపోతున్నాము. విశ్వంలో అడుగడుగునా నీవే ఆ పదార్థ రూపం దాల్చి విస్తరించియున్నావు. ఎండు సమిధలు నీవే. తడి కట్టెలూ నీవే. ఓ ప్రకృతి మూర్తీ నమోవాకాలు.

ఓం నమో లోప్యాయ చోలప్యాయచ

— దశమ యజుస్సు

లోప్యాయచ=కఠిన ప్రదేశ స్వరూపుడగు శివుని కొరకు; ఉలప్యాయచ= రెల్లు గడ్డి లోపల ఉండువాడగు శివుని కొరకు; నమోస్తు.

పరమేశ్వరా! నీ తత్త్వం అత్యాశ్చర్యకరం. ఎందు ఉద్భవిస్తావో ఎందు ఉద్భవింపవో ఎవరూ చెప్పలేరు. నీవు కఠిన ప్రదేశ పదార్థ మూర్తివి. ఆ కఠిన శిలా భూమిలో నీ శక్తి ప్రదర్శిస్తావు. రెల్లుగడ్డిలోని ప్రాణశక్తివి నీవు. నీ అంశ అయిన కుమారస్వామి అందునుంచే పుట్టుకువచ్చాడు కదా.

*　　　　*

ఊనికి శిలోచ్చయంబు- నిజయోష శిలోచ్చయ రాజపుత్రి నీ
ధనువు శిలోచ్చయంబు పురదాహ! రథీకృతరత్నగర్భ నీ
మనమున కీ శిలాశకలమందన మెట్లుప్రియంబుజేసె ఏ
మనగలవాడ నిన్ను వ్రతహాని యొనర్చు దురాత్ముడుండగన్

— ధూర్జటి

ఓం నమ ఊర్మ్యాయచ సూర్మ్యాయచ

— ఏకాదశ యజుస్సు

ఊర్వ్యాయచ=పృథివీ స్వరూపుడగు భవుని కొరకు: సూర్మ్యాయచ=నదీ తరంగ స్థిత రూపుడగు గంగాధరుని కొరకు; నమోస్తు.

అష్టమూర్తీ! నీవు పృథ్వీ స్వరూపుడవు భూనాథుడవు. భూపాలుడవు. శోభలు చిందు తరంగాలు గల అందమైన తరంగిణీ మూర్తివి నీవు. నదీ నదాలు నీ స్వరూపాలు. జల తరంగిణి నీ రూపం. నీకు జోతలు.

## ఓం నమః పర్ణాయచ పర్ణ శద్యాయచ

— ద్వాదశ యజుస్సు

పర్ణాయచ=పర్ణ పదార్థ రూపుడగు శివుని కొరకు: పర్ణశద్యాయచ=ఎండుటాకుల సంఘాత పదార్థ స్వరూపుడగు శంకరుని కొరకు; నమోస్తు.

బిల్వ దళప్రియా! అపర్ణా నాథుడవు. నీవు పర్ణ పత్ర ప్రియుడవు. ఆ పర్ణాల లోని హరిత శోభ నీ శోభయే స్వామీ! ఆహా! ఆ ఎండుటాకులలోని అందమూ నీ తెలదనమే. నీ శుభ్రతయే.

* *

త్రిదళం త్రిగుణాకారం
త్రినేత్రంచ త్రియాయుధమ్
త్రి జన్మ పాప సంహారం
ఏక బిల్వం శివార్పణం!

## ఓం నమోఽపగురమాణాయ చాభిఘ్నతేచ

— త్రయోదశ యజుస్సు

అపగురమాణాయచ=ఉద్యతాయుధ స్వరూపుడగు శివుని కొరకు: అభిఘ్నతేచ=వధించువాడగు హరుని కొరకు; నమోస్తు.

పరమేశ్వరుడు భక్త రక్షణకై సదా బాణాలు ధరించి ఉంటాడు. అప్రమత్తంగా ఉంటాడు. శర్వుడు ఉద్యతాయుధుడై ఉంటాడు. ఆ స్వామి లోకపాలకుడు.

* *

సాటి యెవ్వరు నీకు నిశాటభూష!
కైటభారాతి హాటక గర్భ వంద్య!
ఘన జటాజూటవాటికా ఘటిత వికట
గగనగంగా స్రవంతికా! కరటివైరి!

— శ్రీనాథుడు

ఓం నమ ఆక్షిద తేచ ప్రక్షిదతేచ

— చతుర్దశ యజుస్సు

ఆక్షిదతేచ=మనుష్యులను వారి వారి స్థితినిబట్టి కొద్దిగా బాధించువాడగు శివుని కొరకు; ప్రక్షిదతేచ=మిక్కిలి బాధించువాడునూ అగు శివుని కొరకు; నమోస్తు.

నీవు మానవులను మంచిదారిలోకి తెచ్చుటకు వారి వారి కర్మానుసారంగా కొంచం దుఃఖపెట్టి పరీక్ష చేస్తావు. కొందరు దానికే భయపడి వచ్చి సత్పథంలో ప్రయాణం చేస్తారు. మరికొందరు కఠిన మనస్కులు లోభాలకు లాభాలకు లొంగి పోతారు. వారిని స్వామి మిక్కిలి బాధలలో దుఃఖాలలో నుంచి ఎత్తుతాడు. స్వామి దుఃఖపెడతాడు అంటే వారిని సంస్కరించటం కోసమే.

ఓం నమో వః కిరికేభ్యో దేవానాగ్ం హృదయేభ్యః

— పంచదశ యజుస్సు

కిరికేభ్యః=అర్థులగు భక్తులకు ధనాదులిచ్చు ఉదారులు; దేవానాం హృదయేభ్యః=దేవతలకు హృదయానుభూతి గూర్చునట్టి వారునగు; వః= మీ కొరకు; నమోస్తు.

మహాదేవా! మధుర హృదయా! భక్తులకు కావలసిన ధనం సాధనం అనుగ్రహిస్తున్నావా! ఎంత! కృపాళవులు స్వామీ! మీరు! దేవ ప్రియులు సజ్జన మిత్రులు సుర భూసుర శ్రేష్ఠులకు హృదయం ఇస్తారు. ప్రేమ వర్షం కురిపిస్తారు. దయా హృదయా! నీకు ధన్యవాదాలు.

ఓం నమో విక్షీణకేభ్యః

— షోడశ యజుస్సు

విక్షీణకేభ్యః=ఎన్నడును క్షయము చెందని; దేవనాం హృదయేభ్యః=దేవతలకు హృదయ భూతి గూర్చు పరమేశా!; వః నమః=మీ కొరకు నమస్కారము.

శంకరా! మయస్కరా! నీవు నిత్యుడవు. సత్యుడవు. క్షయ రహితుడవు. సహస్రాదిక సుర సహితుడవు. దేవతలకు హృదయ ప్రియుడవు. దేవదేవా! ప్రణామాలు.

ఓం నమో విచిన్వత్కేభ్యః

— సప్తదశ యజుస్సు

విచిన్వత్కేభ్యః=కోరిన ఫలములు పొందునట్టి; దేవానామ్=దేవతలకు; హృదయేభ్యః=హృదయ భీతి నొసగు; హే శివ!=ఓ శివా; వః నమః=మీ కొరకు నమస్కారము.

దేవతా హృదయాను రక్తా! పాలిత భక్తా! కృపాకరా! జ్ఞాన భాస్కరా! నీ భక్త వర్యులకు అపేక్షితార్థం అందిస్తుంటావు. అవసరమైనది అనుగ్రహిస్తావు. నీకు నీరాజనాలు!

ఓం నమ ఆనిర్హతేభ్యః

— అష్టాదశ యజుస్సు

ఆనిర్హతేభ్యః=అంతట నిశ్శేషముగా పాపహరణము చేయు; దేవానాం హృదయేభ్యః=దేవతలకు హృదయ సంపద లిచ్చు; వః నమః= మీ కొరకు నమస్కారము.

పాపరహితా! కల్మషహరా! దురితదూరా! మహేశ్వరా! నీవు సర్వజ్ఞుడవు. సర్వ మంగళా ప్రియుడవు. సర్వత్ర పాపం నాశనం చేసే దయామయుడవు నీ దివ్య చర్యలకు దేవతలు సంతోషిస్తారు. దేవతా హృదయాలు పులకిస్తాయి. దేవర్షులు ఆనందిస్తారు. స్వామీ! నీకు నమోస్తు.

* *

నీ యందు జగములుండున్
బాయక ఆ జగములందు బాయక నీవుం
దీ యనువు తెలియ అజునకు
తోయజనేత్రునకునైన దోపదు శర్వా!

—శ్రీనాథుడు

ఓం నమ ఆమీవత్కేభ్యః

— ఏకోనవింశ యజుస్సు

ఆమీవత్కేభ్యః=సర్వత్ర స్థూలముగా ఉ. డు; దేవానాంహృదయేభ్యః= దేవతలకు హృదయ భూతి గూర్చు; వః=మీ కొరకు; నమః=నమస్కారము.

విశ్వంభరా! విశ్వేశ్వరా! బ్రహ్మాండ స్వరూపా! నీవు సర్వప్రదేశం నిండి ఉన్నావు. స్థూలరూపంతో సర్వత్ర నిండి ఉంటావు. దేవ హృదయాలకు ప్రియం కగిస్తున్నావు. దేవాదిదేవా! నీకు శత నమోవాకాలు.

## దశమోఽనువాకః

ఓం ద్రాపే అన్ధసస్పతే దరిద్ర న్నీలలోహిత
ఏషాం పురుషాణా మేషాం పశూనాం
మాభేర్మాఽరోమో ఏషాం కించనాఽఽమమత్
యాతే రుద్రా శివాతనూః శివా విశ్వాహ భేషజీ
శివా రుద్రస్య భేషజీ తయా నో మృడ జీవసే
ఇమాగ్ం రుద్రాయ తవసే కపర్దినే
క్షయద్వీరాయ ప్రభరామహే మతిమ్
యథా నః శమసద్ద్విపదే చతుష్పదే
విశ్వం పుష్టం గ్రామే అస్మిన్ అనాతురమ్

మృడా నో రుద్రోతనో మయ స్కృధి
క్షయద్వీరాయ నమసా విధేమ తే
యచ్ఛంచ యో శ్చ మను రాయజే పితా
తదశ్యామ తవ రుద్ర ప్రణీతా
మా నో మహా న్త ముతమా నో అర్భకం
మా న ఉక్ష న్త ముతమాన ఉక్షితమ్
మా నో వధీః పితరం మోత మాతరం
ప్రియా మా న స్తనువః రుద్రరీరిషః
మా న స్తోకే తనయే మా న ఆయుషి
మా నో గోషు మా నో అశ్వేషు రీరిషః
వీరాన్మానో రుద్ర భామితో వధీ
ర్హవిష్మన్తో నమసా విధేమతే
ఆరా త్తే గోఘ్నఉత పూరుషఘ్నే
క్షయద్వీరాయ సుమ్నమ స్తేతే అస్తు
రక్షాచనో అధిచదేవ బ్రూహ్యధాచ
నః శర్మ యచ్ఛ ద్విబర్హాః
స్తుహి శ్రుతం గ ర్తసదం యువానం
మృగం న భీమముపహత్నుముగ్రమ్
మృడా జరిత్రే రుద్రస్తవానో అన్యం
తే అస్మన్నివపంతు సేనాః
పరిణో రుద్రస్య హేతిర్వృణక్తు
పరిత్వేషస్య దుర్మతి రఘాయోః
అవ స్థిరా మఘ వద్భ్యస్తనుష్వ

మీఢ్వస్తోకాయ తనయాయ మృడయ
మీఢుష్టమ శివతమ శివోనః సుమనా భవ
పరమే వృక్ష ఆయుధం నిధాయ
కృత్తిం వసాన ఆ చర పినాకమ్ బిభ్రదాగహి
వికిరిద విలోహిత నమస్తేఅస్తు భగవః యాస్తే సహస్రగ్ం
హేతయోఽన్య మస్మన్ని వపన్తు తాః
సహస్రాణి సహస్రధా బాహువో స్తవ హేతయః
తాసామీశానో భగవః పరాచీనా ముఖా కృధి

## దశమ అనువాకము

ఓం ద్రాపే అంధసస్పతే దరిద్ర న్నీలలోహిత
ఏషాం పురుషాణా మేషాం పశూనాం
మా భేర్మాఽరోమో ఏషాం కించనాఽఽమమత్

— ప్రథమ ఋక్కు

నీలలోహిత=నీలలోహిత వర్ణములుగల రుద్రా! నీవు; ద్రాపే=అన్నార్తులకు కుత్సితగతి కూర్చువాడవు; అంధసస్పతే=ఆహార పరిపాలకుడవు; దరిద్రత్=దేనిని అంటనట్టి వాడవు; ఏషాం పురుషాణామ్=ఈ మా పుత్ర పౌత్రాదుల యొక్క సమూహమును; ఏషాం పశూనామ్=ఈ మా పశుసంతతిని; మా భేః=భయపెట్టవలదు; ఏషాం=ఈ పిల్లలను, పశువులను; కించన=ఏ ఒక్కటి కూడా; మా అరః=నష్టము కాకుండగ; మో ఆమమత్=రోగగ్రస్తము కాకుండగా అనుగ్రహించు.

మహాదేవా! నీలకంఠా! నీ దయాగుణానికి చిహ్నం నీ నీలకంఠం. దుష్టులను నరకానికి పంపిస్తావు. భక్తులకు అన్నంపెట్టి ఆదరిస్తావు. కేవలం వైరాగ్యం అవలంబిస్తావు. తత్త్వంతో ఆనందిస్తావు. విరక్తి అనుసరిస్తావు. విభూతి ధరిస్తావు. ఇంతటి

భద్ర మూర్తివి రుద్రా! ఈ మా స్త్రీ పురుషాదులైన పుత్ర పౌత్రాదులను మా ఈ పశువులను భయపెట్ట వలదు. స్వామీ! మా పుత్ర సంపద మా పశుసంపద ఏదీ తరుగకూడదు. ఎవరికీ అనారోగ్యం కలుగకూడదు. అభయం అందించుదేవా!

ఓం యాతే రుద్ర! శివాతనూః శివా విశ్వాహ భేషజీ
శివా రుద్రస్య భేషజీ తయానో మృడ జీవసే

— ద్వితీయ ఋక్కు

హే రుద్ర!=ఓ రుద్రదేవా!; తే యా తనూ శివాః=నీ ఏ తనువు శాంతము, కల్యాణప్రదమైనదో; యాశివా=ఏ శివంకర శరీరము; విశ్వాహ భేషజీ=సదారోగ దారిద్ర్యాలకు ఔషధము వంటిదో; యాశివా=ఏ శాంత శరీరము; రుద్రస్య=రుద్రుని యొక్క; తాదాత్మ్య ప్రాప్తయే=తాదాత్మ్యం ప్రాప్తి పొందుటకు; భేషజీ=ఔషధ రూపమో; తయా=ఆ శివంకర రుద్ర శరీరముచే; నః=మమ్ము; జీవసే=సుఖ జీవనము చేయుట కొరకు; మృడ=అవకాశమిచ్చి సౌఖ్య పెట్టుదువుగాక!

ఓ రుద్రా! మహాభద్రా! నీ తనూప్రభ సత్యం శివం సుందరం. నీ విభూతి శివంకరం. శుభంకరం. అది జయంకరం. నీ తనువే తత్త్వం. అది ఆధ్యాత్మిక సత్యం. నీ రూపం అత్యంత శాంతం. అతి పునీతం. మహా మహిమాన్వితం. ఓ రాజశేఖరా! హరా! సర్వేశ్వరా! నీ తనూ భసిత విభూతి సర్వవేళల సర్వ ప్రజలకు సర్వరోగాలను హరింప జేయటంలో దివ్యౌషధం. ఓ భవ్య స్వరూపా! జ్ఞానదీపా! జ్ఞానార్జనలో నీ దర్శనం నీ తోడి తాదాత్మ్యప్రాప్తికి పరమౌషధం. శివా! నీ పరమ పవిత్ర దివ్యదేహ విభూతితో మమ్ము మా బిడ్డపాపలను మా గొడ్డుగోదలను పుష్టిగా ఆనందంగా చిరకాలం జీవించేటట్లు సుఖపెట్టు తండ్రీ!

ఓం ఇమాగ్ం రుద్రాయ తవసే కపర్దినే
క్షయద్వీరాయ ప్రభరామహే మతిమ్
యథా నః శమసద్విపదే చతుష్పదే
విశ్వం పుష్టం గ్రామే అస్మిన్ అనాతురమ్

— తృతీయ ఋక్కు

యథా=ఏ విధముగానైతే; నః ద్విపదే చతుష్పదే=మా పిల్లల కొరకు పశువుల కొరకు; శం అసత్=సుఖము క్షేమము అగునో; కించ=మరియు; అస్మిన్=ఈ ప్రదేశమందుగల; విశ్వమ్=వివిధ జీవులందరు; పుష్టమ్ అసత్=సుఖముగా బలముగా; అసత్=ఉందురో; తథా=ఆ తీరునకై; వయమ్=మేము; తవసే కపర్దిక్షయద్వీరాయ=మహాబలుడు వాంఛా ఫలదుడు- జటామకుటధారి- ప్రతిపక్షమును క్షీణింప జేయువాడు పాపరహితుడు పాపహరుడు అగు; రుద్రాయ=రుద్రుని కొరకు; ఇమాంమతిమ్=ఈ పవిత్ర పూజారత బుద్ధిని; ప్రభరామహే=మిక్కిలిగా పోషించు కొందుముగాక!.

తత్త్వజ్ఞాన దానకరా! శంకరా! నీవు ఐహిక బలసంపన్నుడవు. సర్వ సమర్థుడవు. సర్వజ్ఞుడవు. మా వాంఛలు తీర్చు వరదాతవు. ప్రతిపక్ష బలక్షయకరుడవు. నీకు నమోవాకాలు. మా దారాపుత్ర మిత్ర బంధు వర్గానికి సౌఖ్యం ప్రసాదించు! మా పశువులకు ఆరోగ్యం బలం చేకూర్చు! మా గ్రామజనులు సుఖింతురుగాక! మా విశ్వ పౌరులు ఉపద్రవ రహితులై జీవింతురుగాక! మహాదేవా! మా యీ అభీప్సితాలు నెరవేర్చి మమ్ము ప్రోవుము తండ్రీ!

ఓం మృడానో రుద్రోత నోమయస్కృధి
క్షయద్వీరాయ నమసా విధేమతే
యచ్ఛంచ యోశ్చ మనురాయజే పితా
తదశ్యామ తవ రుద్ర ప్రణీతౌ

— చతుర్థ ఋక్కు

హే రుద్రః!=ఓ రుద్రదేవా!; నః=మమ్ము; ఇహమృడా=ఇచ్చట సుఖపెట్టుము; ఉత=మరి; నః మయః కృధిః=మమ్ము పరలోకాలలో కూడ సుఖవంతులను జేయుము; క్షయద్వీరాయ=మా పాపాలు హరించు స్వామీ!; తే నమసావిధేమ=నీ కొరకు నమః పరిచర్య చేయుదుముగాక!; పితామనుః=తండ్రి, ప్రజాపతి అగు మనువు నుండి; యోశ్చశంచ=దుఃఖములేని సుఖమును; యత్=ఏ కొంచము; ఆయజే=సంపాదింపకొన్నామో; తత్=దానిని; హే రుద్ర=ఓ రుద్రదేవా!; తవ ప్రణీతౌ సత్యామ్=నీ కృపా స్నేహాతిశయము వలన; అశ్యామ=పొందుదుముగాక!

మహాదేవా! సదాశివా! నీవు మా మీద దయతలచి మాకు ఈ లోక భోగాలు సౌఖ్యాలు చేకూర్చిపెట్టు. మేము పరలోకం వెళ్ళినప్పుడు అక్కడ కూడా స్వర్గ సౌఖ్యాలు సర్వం మాకు సమకూర్చిపెట్టు. మా దురిత కర్మలు క్షయం చేసే దయా మయా! నీకు సదా నమస్కార పరిచర్యలు చేసుకొంటూంటాము. మా పరిపాలకు డైన మను మహారాజు దుఃఖరహిత సుఖం ఏ కొంచం మా కొరకు సంపాదించి విభజించి ఉంచాడో దానిని ఓ రుద్రదేవా! మహానుభావా! నీ కృపా బలంచేత పొందు దుముగాక! నమోస్తు!

*  *

నీ యందు సంభవించును
నీ యంద వసించియుండు నిఖిల జగంబుల్
నీ యంద లయము పొందును
నీ యుదరము సర్వభూతనిలయము రుద్రా!

— పోతన

ఓం మా నో మహాంత ముతమా నో అర్భకం
మా న ఉక్షంత ముత మాన ఉక్షితమ్
మా నో వధీః పితరం మోత మాతరం
ప్రియా మాన స్తనువః రుద్రరీరిషః

— పంచమ ఋక్కు

హే రుద్ర = ఓ రుద్రదేవా!; నః మహాంతం మారీరిషః = మా వృద్ధ జీవులను బాధింపకుందువు గాక!; ఉత = మరియు; అర్భకం మారీరిష = మా అర్భకులను నొప్పించకుందువుగాక: ఉత = మరియు; నః ఉక్షంతం మారీరిషః = మా యువకులైన సుతులను బాధలు పెట్టకుందువుగాక!; ఉత = మరియు; నః ఉక్షితం మారీరిషః = మా గర్భస్థ శిశువులను కష్టపెట్టకుందువుగాక!; ఉత = మరియు; నః పితరం మారీరిషః నః మాతరం మారీరిషః = మా తండ్రిని తల్లిని హరించకుందువు గాక; ఉత = మరియు; నః ప్రియాః తనువః మారీరిషః = నా ప్రియమైన తనువును నొప్పించ కుందువు గాక!;

ఓ రుద్రదేవా! సదాశివా! శంకరా! దయాకరా! మా వృద్ధ జనులు పుణ్య కార్యాలు చేసినవారు. వారికి ఏ విధమైన బాధ కలిగించవద్దు. మా అర్భకులు అమాయకులు. పాపం పుణ్యం ఎరుగనివారు. వారికి ఏమీ నొప్పి కలిగించవద్దు. మా కుమార యువకులు సుకుమారులు. వారిని ఎప్పుడూ హింసించవద్దు. మా గర్భస్థ శిశువులు పసికందులు. వారికి అసుఖం కలిగించవద్దు. మా తండ్రిగారు పరమ పూజ్యులు. వారి మనస్సు వ్యథ పెట్టవద్దు. మా మాతృమూర్తి పరమ దయామయి. ఆ కన్నతల్లి ని కష్ట పెట్ట వద్దు. మా శరీరాలు ప్రియమైనవి యాతనలు పెట్టవద్దు. మా యందరికి మంచి సుఖం కలిగించు. నీకు నమస్సులు.

ఓం మానస్తోకే తనయే మాన ఆయుషి
మా నో గోషు మానో అశ్వేషు రీరిషః
వీరాన్మా నో రుద్ర భామితో వధీః
హవిష్మంతో నమసా విధేమ తే

— షష్ఠ ఋక్కు

హే రుద్ర=ఓ రుద్రదేవా!; నః తోయే తనయే మారీరిషః=మా సంతానము నందు తనయులందు బాధలు కలుగజేయ కుందువు గాక!; నః ఆయుషి మారీరిషః= మా ఆయువులందు కోత కోయకుందువు గాక!; నః గోషు నః అశ్వేషు మారీరిషః= మా ఆవులను గుఱ్ఱాలను హింసించకుందువు గాక!; నః వీరాన్ భామితః మావధీః =మా భృత్యుల వలన దొసగులు జరిగిన క్రుద్ధుడవై వారిని వధించ కుందువుగాక! వయః హవిష్మత=మేము హవిస్సుగలవారమై; తే నమసా=నీ కొరకు వందనాలతో సదా; విధేమ=పరిచర్యలు చేయుదుముగాక!

దయాసముద్రా! శంకరా! మా సంతానం తెలియక తప్పులు చేస్తుంది. అందుకు ఆగ్రహించవద్దు. మా తనయులు ధర్మ కర్మ పరాయణులు ఎప్పుడైనా పొరపాటు జ గవచ్చు అంతమాత్రానికి వారిని హింసించవద్దు. మా ఆయువులు అత్యల్పాలు. అవి కొస్త హరించవద్దు. మా గోవులు ధర్మదేవతలు. వాటికి మనో వ్యథ కలిగించవద్దు. మా అశ్వాలను శుష్కింప జేయవద్దు. మా భృత్యులు అల్పులు. వారిని వధించవద్దు. మేము హవిర్భాగాలు తెచ్చి అర్చిస్తాము. నీకు నమస్కార పుర

సాక్షాత్కారాలతో పరిచర్యలు చేస్తుంటాము. అనుగ్రహించు. ఆనంద సింధూ! ఆత్మ బంధూ! నమోస్తు.

ఓం ఆరాత్తే గోఘ్న ఉత పూరుషఘ్నే
క్షయద్వీరాయ సుమ్నమస్మే తే అస్తు
రక్షాచ నో అధిచదేవ బ్రూహ్యధాచ
నః శర్మ యచ్ఛ ద్విబర్హాః

— సప్తమ ఋక్కు

హే రుద్ర!=ఓ రుద్రా!; గోఘ్నే ఉతపూరుషఘ్నే=దుష్ట జంతువులను మరియు దుష్ట పూరుషులను సంహారించునట్టి; క్షయద్వీరాయ=ఉద్ధృత భృత్యులను క్షయము చేయునట్టి; తే ఉగ్రమ్=నీ ఉగ్ర స్వరూపము; ఆరాత్=దూరముగా; అస్తు=ఉండుగాక!; తే సుమ్నమ్=నీ సుఖంకర శంకర రూపము; అస్మే అస్తు=మాకు సాక్షాత్కరించుగాక!; చ=మరియు; ఆ రూపముతో; నః రక్ష=మమ్ము రక్షించుగాక!; చ దేవ!=మరియు ఓ దేవా!; నః=మమ్ము గూర్చి దేవతలకు; అధి బ్రూహి=అధికముగా బాగుగా చెప్పుదువుగాక!; అధాచ=మరి ఇంక; ద్విబర్హాః=ఇహపర రెండు లోకాలను వృద్ధిచేయునీవు; నః=మా కొరకు; శర్మయచ్ఛ=పరమ సుఖయు నిచ్చుదువు గాక!

ఓ రుద్రదేవా! నమోస్తు! నీ భయంకర ఉగ్ర రూపం ఉపసంహరించు. కొన్ని ధేనుకాసురాది గోవేష సాధువేష దూషిత రాక్షస శక్తులను సంహరించటానికి ఉగ్ర రూపం దాల్చావు. ఆ రాక్షస సంహారం జరిగింది. ఇక ఆ రూపం మాకు చూపించ వద్దు ఆ రూపం దూరం చేయుదువుగాక!

సదాశివా! సుదుచిరమూ సుఖకరమూ అయిన నీ శాంత సుందర జగన్మంగళ స్వరూపంతో మా ముందు ప్రత్యక్షమగుదువుగాక! మా యందు ప్రసన్నమగుదువు గాక! పరమేశ్వరా! మా అందరినీ, మా ...మి అంతటనూ పరమ సౌఖ్యంగా బహు కాలం పరిపాలించు. సదా చల్లగా వీక్షించు. కటాక్షించు. రక్షించు. ఓ మహాదేవా! మమ్ము గూర్చి మా మంచితనం గూర్చి దేవతలకు శ్రద్ధగా ఇతరులకంటె కొంఛం

అధికంగా వివరించ బోధించు. ఇహపర సౌఖ్యాలు గూర్చు సాంబశివా! మాకు సుఖ సంతోషాలు చేకూర్చు. నీకు వందనాలు.

ఓం స్తుహి శ్రుతం గర్తసదం యువానం
మృగం న భీమ ముపహత్ను ముగ్రమ్
మృడా జరిత్రే రుద్ర స్తవానో
అన్యం తే అస్మిన్ నివపంతు సేనాః

— అష్టమ ఋక్కు

హే మదీయ వచః = శ్రీమద్వాణీ!; త్వమ్ = నీవు; గర్తసదమ్ = గర్త సదృశమైన హృదయ కమల కుహరములో ఉన్నవాడు; యువానామ్ = నిత్యయౌవన పురుషుడు; ఉపహత్నుమ్ = ప్రళయవేళ జగత్సంహారము కొరకు; భీమం మృగం న = కరికి భయంకరమైన సింహమువలె; ఉగ్రమ్ = మహోగ్ర స్వరూపుడు అని; శ్రుతమ్ = వినుచున్న ప్రసిద్ధ రుద్ర మూర్తిని గూర్చి; స్తుహి = స్తుతి పాఠము సేయుము; హే రుద్ర! = ఓ రుద్రదేవా!; స్తవానః = మాకు స్తుతి పాత్రుడవై మానతులు గైకొని; జరిత్రే = నిత్యము క్షీణించు స్వభావము గల శరీరము నందు కొంచెము; మృడా = సుఖము గూర్చుము; తే సేనాః = నీ సేనలు: అస్మత్ అన్యత్ = మాకు పరులైన దుష్టులను; నివపంతు = నాశనము చేయుదువు గాక!

మదీయ మధురవాణీ! వాగ్దేవీ! సదాశివ పరబ్రహ్మం ప్రతివాని యొక్క గర్త సదృశమైన హృదయ పుండరీకంలో ప్రకాశిస్తున్నాడు. ఈశ్వరుడు సర్వహృదయ నివాసి. 'ఈశ్వర స్సర్వభూతానాం హృద్దేశఒర్జున తిష్ఠతి' అని స్మృతి గదా.

ఆ ఈశ్వర ప్రభువు మహా తేజోనిధి ఆ స్వామి ప్రళయకాలంలో సర్వ జగత్సంహారానికి భయంకర సింహంవలె ఉగ్రరూపం ధరిస్తాడు. ఆ ప్రభువు మిక్కిలి త్రిజగత్ప్రసిద్ధుడు. నీవు ఆ రుద్రదేవుని మనసారా నోరారా స్తుతించు. స్తవం చేయి. అది నీ ధర్మం. ఓ రుద్రా! భద్రా! కరుణాసముద్రా! మా సంస్తవం గ్రహించు. దిన దినం క్షీణిస్తున్న మా శరీరానికి ఆరోగ్య సుఖం ప్రసాదించు. నీ శివసేనలు మా సదాశయానికి విరుద్ధులైన అరులను అణగార్చుగాక! శివా! నమోస్తు.

ఓం పరిణో రుద్రస్య హేతిర్వృణక్తు
పరి త్వేషస్య దుర్మతి రఘాయోః
అవస్థిరా మఘవద్భ్యి స్తనుష్వ
మీఢ్వస్తోకాయ తనయాయ మృడయ

—నవమ ఋక్కు

రుద్రస్య హేతిః = రుద్రుని ఖడ్గము; నః పరివృణక్తు=మా దోషాలు ఎంచక మమ్ము విడుచుగాక !: త్వేషస్య=క్రోధోజ్జ్వలితుడు; అఘాయోః= పాప హారుడు అయిన రుద్రునియొక్క: దుర్మతిః=మహాతీక్ష్ణమైనమతి; నః పరివృణక్తు = మా దోషాలు ఎంచక మమ్ము విడుచుగాక !; స్థిరా = అరినాశనమునకైన దృఢమైన ఉగ్రబుద్ధిని; మఘవద్భ్యః=హవిర్లక్షణ యజమానులనుండి; అవతనుష్వ=తొలగింప జేయుము; హే మీఢ్వః = కాంక్షఫలములు వర్షించు రుద్రదేవా!; తోకాయ = మా సంతతి కొరకు; తనయాయ = పుత్రపౌత్రుల కొరకు; మృడయ= సుఖము గూర్చుము.

లోకంలోని దుష్టదురాచార దుర్మార్గాలు, ఘోర రాక్షసకృత్యాలుచూచి త్రినేత్రుడు మహాక్రోధోజ్జ్వలితుడై పాప సమూహాన్ని ప్రహారం చేస్తున్నాడు. మహాకాలుడు దుష్టసంహారంకొరకు ఉగ్రమూర్తియై ప్రళయతాండవం చేస్తున్నాడు.

అపుడు నా ప్రార్థన ఇది— ఓ రుద్రమూర్తీ ! నీ చేతిలో అమిత వాయు వేగంతో వీరవిహారంచేసే నీహేతియొక్క తీవ్రతీక్షణ మహోగ్ర చ్ఛటలు ఏ ఒక్కటీ మాకు సోకకుండుగాక! నీ నిశితఖడ్గధారలు శిష్టులను అంటకుండుగాక! దుష్టనాశన శీలమైన నీ ఉగ్రబుద్ధ్యగ్నిశిఖలు హవిర్యుక్తులైన మా యజమానులను విడుచుగాత! హే అభీష్టవర్ష ప్రదాయకా ! రుద్రా ! నీవు మా పుత్రులకు పౌత్రులకు సుఖములు అనుగ్రహింతువుగాక !

ఓం మీఢుష్టమ శివతమ శివోనః సుమనా భవ
పరమేవృక్ష ఆయుధం నిధాయ
కృత్తిం వసాన ఆ చర పినాకమ్ బిభ్రదాగహి

—దశమ ఋక్కు

మీడుష్టమ! = అతిశయ అభీష్టదములు వర్షించువాడా!; హే శివతమ! = అతి శాంతస్వరూపా!; నః = మమ్ము గూర్చి; శివః = శాంతుడవు శుభంకరుడవు; సుమనాః = సుమనస్కుడవు; భవ = అగుదువుగాక!; ఆయుధమ్ = ఆయుధమును; పరమే వృక్షే = అత్యుత్తమైన అశ్వత్థాదివృక్షాలపైన; నిధాయ = ఉంచి; కృత్తిమ్ వసాన = వ్యాఘ్ర చర్మాంబరధారివై; ఆచర = రమ్ము; పినాకమ్ = పినాకధనువును; బిభ్రత్ ఆగహి = చేతితో పట్టుకొని వచ్చెదవుగాక !

ఓ పరమేశ్వరా! పరమదయాళూ! నీవు భక్తులకు అతిశయ వాంఛా ఫలాలు వర్షించువాడవు. శివుడవు. శివతముడవు. పరమశాంత స్వరూపుడవు. సుమనస్సు గలవాడవు. సుఖస్వరూపుడవు. సాంబశివా! నీవు సౌమనస్యమూ సహృదయత్వమూ, కారుణ్యమూ గలవాడవగుదువుగాక!

నీ ఖడ్గబాణ త్రిశూలాద్యాయుధాలు అత్యున్నతమైన అశ్వత్థ వట శమీ వృక్ష శాఖా పత్రాలలో పరులకు కనుపించనట్లు భద్రపరుచు. కేవలం వ్యాఘ్ర చర్మాంబరం ధరించి విభూతిసుందరుడవై మా కభిముఖంగా ప్రసన్నవదనంతో ప్రత్యక్షం కా! పినాకపాణీ! నీకు పినాకంపై ప్రీతికనుక అలంకారంగా ఆ ఒక్క ధనుస్సూ ధరించిరా! మా అందరినీ అనుగ్రహించు

**ఓం వికిరిద విలోహిత నమస్తే అస్తు భగవః**
**యాస్తే సహస్రగ్ం హేతయో న్యఽ మస్మ న్నివపంతు తాః**

—ఏకాదశ ఋక్కు

హే రుద్ర! = ఓ రుద్రా! నీవు; వికిరిద = విశేషముగా ధనము నిచ్చువాడవు; విలోహిత = విశేష లోహితవర్ణము గలవాడవు (లేక) శ్వేతవర్ణముగలవాడవు; భగవః = షడ్గుణైశ్వర్య సంపన్నత గలవాడవు; తే నమః అస్తు = నీ కొరకు నమస్కారమగుగాక!; తేసహస్రం = నీ అనేకములైన; యాః హేతయః = ఏ ఖడ్గాలు; సంతి = కలవో; తాః = ఆ ఖడ్గాలు; అస్మత్ = మాకు; అన్యమ్ = పరులైన వారిని; నివపంతు = నశింపజేయుగాక !

చంద్రశేఖరా! ఈ రజితాద్రిపై నీ సందర్శనం నయనానందకరం. సంతోష

భరితం. నీ తనూ శోభ స్వచ్ఛ శుభ్రజ్యోత్స్నా విలసితం. విభూతి సుందరం. విలోహితం.

స్వామీ! జ్ఞానభాస్కరా! ఈ ప్రాతఃకాలం నీ దేహం విశేష లోహితంగా ఉంది. అరుణారుణ రసరంజితంగా ఉంది. ఇప్పుడు అరుణమూర్తివై తామ్రవర్ణంలో మనోజ్ఞంగా ఉన్నావు. ఈశ్వరా! నీవు షడ్గుణైశ్వర్య సంపన్నుడవు. అందుకే నీవు భక్తులకు విరివిగా విశేషసంపదలు అనుగ్రహిస్తున్నావు. భక్తులు తండోపతండాలుగా నీ ముందు వరసలు తీర్చికూర్చున్నారు. నిన్ను కొలుస్తున్నారు. మహాదేవా! నటరాజమూర్తీ! నీకు శతసహస్ర నమోవాకాలు. నీ సహస్రాధిక ఆయుధాలు మా దుర్మార్గ విరోధులను నిహతులను చేయుగాక!

ఓం సహస్రాణి సహస్రధా బాహువో స్తవహేతయః
తాసామిశానో భగవః పరాచీనా ముఖాకృధి

—ద్వాదశ ఋక్కు

హే రుద్ర! = ఓ రుద్రదేవా!; తవ బాహువో = నీ చేతులలోని; హేతయ = ఖడ్గ ఆయుధాలు; సహస్రధా = సహస్రవిధాలుగా; సహస్రాణి = సహస్ర సంఖ్యాక ములై; విద్యంతే = విరాజిల్లుతున్నవి; హే భగవః = ఓ భగవాన్! ఓ షడ్గుణైశ్వర్య సంపన్నా!; ఈశానః = సర్వ సమర్థుడవై; తాసామ్ = ఆ ఆయుధాల; ముఖా (ని) = మొనలను; పరాచీనా (ని) = మా పైపునుండి విముఖములుగా; కృధి = చేయుదువు గాక!

ఓ సహస్రశీర్ష పురుషా! నీ బాహువులలో నీకుగల ఆయుధాలు అసంఖ్యాకాలు. సహస్రాధికాలు సహస్రవిధాలు. శతసహస్రకోట్లు. ఓ భగవాన్! నీవు షడ్గుణైశ్వర్య సంపన్నుడవు. ఈశానుడవు. సర్వ సమర్థుడవు. సర్వజ్ఞుడవు. ప్రభూ! మా దొక్క ప్రార్థన. నీ ఆయుధముఖాలు అటువైపు త్రిప్పి పట్టుకొందువు గాక! నీకు సహస్రనీరాజనాలు.

## ఏకాదశో౽నువాకః

ఓమ్ సహస్రాణి సహస్రశో యేరుద్రా అధి భూమ్యామ్
తేషాగ్ం సహస్రయోజనే౽వధన్వాని తన్మసి
అస్మిన్మహత్యర్ణవే౽న్తరిక్షే భవా అధి
నీలగ్రీవా శ్శితికంఠా శ్శర్వా అధః క్షమాచరాః
నీలగ్రీవా శితికంఠాదివగ్ం రుద్రా ఉపశ్రితాః
యే వృక్షేషు సస్పింజరా నీలగ్రీవా విలోహితాః
యే భూతానా మధిపతయో విశిఖాసః కపర్దినః
యే అన్నేషు వివిధ్యన్తి పాత్రేషు పిబతో జనాన్
యే పథాం పథిరక్షయ ఐలబృదా యవ్యుధః
యే తీర్థాని ప్రచరంతి సృకావన్తో నిషంగిణః
య ఏతావన్తశ్చ భూయాగ్ం సశ్చదిశోరుద్రా వితస్థిరే
తేషాగ్ం సహస్రయోజనే౽వధన్వాని తన్మసి
నమో రుద్రేభ్యో యే పృథివ్యాం యే౽న్తరిక్షే యేదివి
యేషా మన్నం వాతో వర్ష మిషవస్తేభ్యో
దశ ప్రాచీ ర్దశదక్షిణా దశ ప్రతీచీ ర్దశోదీచీ
ర్దశోర్ధ్వా స్తేభ్యో నమస్తే నో మృడయన్తు
తేయం ద్విష్మో యశ్చనో ద్వేష్టి తం వోజంభే దధామి

## ఏకాదశ అనువాకము

ఓం సహస్రాణి సహస్రశో యే రుద్రా అధిభూమ్యామ్
తే షాగ్ం సహస్ర యోజనేఽవ ధన్వాని తన్మసి

— ప్రథమ ఋక్కు

యే రుద్రాః=ఏ రుద్రదేవులు; భూమ్యామ్ అధి=భూమి ఉపరిభాగాన; సహస్రశః=సహస్ర విధాలుగా; సహస్రాణి సంతి=సహస్ర సంఖ్యలో గలరో; తేషామ్=ఆ రుద్రదేవుల (రూపంతో నీవు) ధన్వాని=ధనువుల అల్లెత్రాళ్ళను; సహస్ర యోజనే=సహస్ర యోజనాల దూరము వరకు; అవతన్మసి=పట్టి యుంచి నావు.

రుద్రదేవులు భూమికి ఉపరి భాగాన అవతరించియున్నారు. వారు సహస్ర రూపాలు ధరించి యున్నారు. వారు సహస్ర విధాల వ్యాపించి యున్నారు. ఆ సహస్ర రుద్రులు ధనుస్సులు ధరించి యున్నారు. అల్లెత్రాళ్ళతో ఆ ధనుస్సులను వ్యాప్తము చేసి పట్టి యున్నారు. ఆ రుద్రాంశ వీరులు, భక్తులను పరిపాలిస్తూ, దుష్టశక్తులను నిరోధిస్తుంటారు.

ఓం అస్మి న్మహత్యర్ణవేఽంతరిక్షే భవా అధి

— ద్వితీయ ఋక్కు

అస్మిన్=ఈ విధమైన; మహతి అర్ణవే=మహా సముద్ర సదృశమైన; అంతరిక్షే=అంతరిక్షమును; అధి భవాః=ఆశ్రయించి రుద్రులు; యేసంతి=ఎవరు గలరో; తే షామ్=ఆ రుద్రదేవుల (రూపంతో నీవు) ధన్వాని=ధనుస్సుల వింటి నారులను; సహస్ర యోజనే=సహస్ర యోజనాల వరకు; అవతన్మసి=పట్టి యుంచినావు.

ఆ రుద్రావతార మూర్తులు సర్వత్ర వ్యాపించి యున్నారు. వారు ఈ దృశ్యమానమైన మహార్ణవ సదృశ అంతరిక్షం అంతటా ఆక్రమించి యున్నారు. వారు ధనుర్బాణాలు ధరించి యున్నారు. వారు సహస్ర రూపులు. శత సహస్ర యోజనాల దూరదూర ప్రదేశాల వరకూ అల్లెత్రాళ్ళతో ఆ ధనుస్సులను వ్యాప్తము చేసి ఉన్నారు.

ఓం నీలగ్రీవాః శితికంఠాః శర్వా అధః క్షమా చరాః

— తృతీయ ఋక్కు

నీలగ్రీవాః=నీలగ్రీవులుగా; శితికంఠాః=శ్వేత కంఠులుగా; అధః క్షమా చరాః=భూమికి క్రింద పాతాళములందు సంచరించు; శర్వాః=రుద్ర మూర్తులు: యే సంతి=ఎవరు గలరో; తే షామ్=ఆ రుద్రుల (రూపంతో నీవు) ధన్వాని= ధనువుల అల్లెత్రాళ్ళను; సహస్ర యోజనే=వేలకొలది యోజనాల వరకు; అవ తన్మసి=పట్టి యుంచినావు.

రుద్ర మూర్తులలో కొందరు నీలగ్రీవులు మరి కొందరు శతికంఠులు. ఈదృశ రుద్ర విశేష మూర్తులు సర్వులు శర్వ విశేషులు. వారు పాతాళంలో ఈ భూమికి క్రింద అధో భాగంలో సంచరిస్తున్నారు. శత సహస్ర యోజనాల వరకూ అల్లె త్రాళ్ళతో ఆ ధనుస్సులను వ్యాప్తము చేసి ఉన్నారు.

ఓం నీలగ్రీవాః శితికంఠా దివగ్ం రుద్రా ఉపశ్రితాః

— చతుర్థ ఋక్కు

నీలగ్రీవాః=నీలగ్రీవులు; శితికంఠాః=శితికంఠులు అయిన; రుద్రాః=రుద్ర దేవతలు; యే=ఎవరు; దివమ్=ద్యో లోకమును; ఉపశ్రితాః=ఆశ్రయించి; సంతి= ఉన్నారో; తే షామ్=ఆ రుద్రదేవతల (రూపంలో నీవు): ధన్వాని=ధనువుల వింటి నారులను; సహస్ర యోజనే=వేల యోజనాల పర్యంతము; అవతన్మసి=వ్యాప్త ము చేసి ఉంచినావు.

పరమ రుద్రావతార మూర్తులైన నీలగ్రీవులు శితికంఠులు దివము నాశ్రయించి యున్నారు. ద్యోలోకము సువిశాలం. అందు అణువణువు నందు ప్రకాశిస్తున్నారు. వారు శత సహస్ర యోజనాల దూర దూర ప్రదేశాల వరకూ వింటి నారులతో వారి ధనుస్సులను వ్యాప్తము చేసి మంత్రించి ఉపాసించి పట్టి ఉంచినారు.

ఓం యే వృక్షేషు సస్పింజరా నీలగ్రీవా విలోహితాః

— పంచమ ఋక్కు

సస్పింజరాః=లేత పచ్చిక వంటి పింజర వర్ణము గలవారును: నీలగ్రీవాః= నల్లని రంగు కంఠము గల వారును: విలోహితాః=విశేష లోహిత వర్ణము గలవారు నగు రుద్రులు; యే=ఎవరు; వృక్షేషు=అశ్వత్థ కల్ప వృక్షాదులందు: సంతి=కలరో తేషామ్=ఆ రుద్ర వీరుల యొక్క (రూపంతో నీవు): ధన్వాని=ధనువుల అల్లె త్రాళ్ళు: సహస్ర యోజనే=సహస్ర యోజనాల పర్యంతము: అవతన్మసి=వ్యాప్తము చేసి ఉంచినావు.

ఇచట వృక్ష వన ప్రదేశాలలో మహారుద్ర తత్త్వజ్ఞులు రుద్రావతారం దాల్చి సంచరిస్తున్నారు. వారు లకుపచ్చని వర్ణం కలవారు. వారిలో కొందరు నీలగ్రీవులు. మరి కొందరు విశేష లోహిత వర్ణ శోభితులు. వారు అందరూ ధనుర్బాణాలు ధరించి యున్నారు. వారు శతసహస్ర యోజనాల దూర ప్రాంతల వరకూ ధనుస్సులు అల్లెత్రాళ్ళతో సంధించి ఉంచినారు.

**ఓం యే భూతానా మధిపతయో విశిఖాసః కపర్దినః**

— షష్ఠ ఋక్కు

భూతానామ్=అంతర్హిత శరీరులు అగు గణ విశేషములకు: అధిపతయః= అధిపతులు: విశిఖాసః=ముండిత శిరస్కులు; కపర్దినః=జటాధారులు అగు రుద్రులు: యే సంతి=ఎవరు కలరో; తేషామ్=ఆ రుద్రుల యొక్క (రూపంతో నీవు): ధన్వాని=ధనువులకు గల అల్లెత్రాళ్ళను: సహస్ర యోజనే=సహస్ర యోజనాల పర్యంతము: అవతన్మసి=వ్యాప్తము చేసి పట్టి ఉంచినవాడవై యున్నావు.

కొందరు రుద్రమూర్తుల శరీరాలు సాధారణ మనుష్యులకు కనిపించవు. వారు కనిపించకుండా దుష్కర్మ వర్తనులకు ఉపద్రవాలు కలిగిస్తుంటారు. మరికొందరు ఆ భూతగణాలకు అధిపతులు. కొందరు ముండిత శిరస్కులు. మరికొందరు జటా వల్కల ధారులు. ఆ రుద్ర మూర్తులు ధనుస్సులు అంబులు అల్లెత్రాళ్ళు ధరించి యున్నారు. వారి ధనుశ్శక్తులను శత సహస్ర యోజన పర్యంతం వ్యాప్తం చేసి ఉంచుతున్నారు. వారి పాదపద్మాలకు ప్రణామాలు.

**ఓం యే అన్నేషు వివిధ్యంతి పాత్రేషు పిబతో జనాన్**

— సప్తమ ఋక్కు

యే=ఏ రుద్ర మూర్తులు రహస్యముగా; అన్నేషు=అన్న పదార్థములందు దాగి; జనాన్=అన్నము అక్రమముగా తినే జనులను; పాత్రేషు=పాత్రముల ద్వారా దుష్టమై అశుద్ధ అయోగ్యక్షీరాదులను; పిబతః=త్రాగేటువంటి; జనాన్=జనులను; వివిధ్యంతి=ధాతువైషమ్యాదికముచే బాధించుచున్నారో; తేషామ్=ఆ రుద్రుల (రూపంతో నీవు) ధన్వాని=ధనువుల అల్లెత్రాళ్ళను సహస్ర యోజనే=సహస్ర యోజనాల వరకు; అవతన్మసి=వ్యాప్తముచేసి పట్టి ఉంచినావు.

కొందరు రుద్ర మూర్తులు అన్నపదార్థాలందు అంతర్నిహితులై గూఢంగా ఉంటారు. వారు అపాత్రులు అయోగ్యులు అపక్వ అన్యాయార్జిత ఆహారం భుజించినప్పుడు వారికి ధాతువైషమ్యం గూర్చి బాధిస్తారు. మరికొందరు రుద్రావతారాలు గూఢంగా క్షీరోదక పాత్రలందుండి ఇటువంటి జనులు పుచ్చుకొని త్రాగే సమయంలో వారికి వ్యాధులు కలిగించి భంగ పరుస్తారు. వారందరు రుద్ర భటులు. వారు ధనుస్సులు అంబులు అల్లెత్రాళ్ళు ధరించి ఉంటారు. వారి ధనుశ్శక్తులు అపరిమితాలు అమోఘాలు ఆ శక్తులను సహస్ర యోజన పర్యంతం పట్టి ఉంచుతున్నారు. ఆ రుద్రమూర్తులకు అభివాదాలు.

## ఓం యే పథాం పథిరక్షయ ఐలబృదా యవ్యుధః

— అష్టమ ఋక్కు

యే=ఏ రుద్రదేవులు; పథామ్=వైదిక లౌకిక మార్గ; పథి=ప్రవర్తకులకు; రక్షయః=సంరక్షకులో!; ఐలబృదాః=అన్న పదార్థాదులు పెట్టి పోషించేవారో!; యవ్యుధః=వైరులతో సంగ్రామము చేయువారో; తేషామ్=ఆ రుద్రమూర్తుల యొక్క (రూపంతో నేవు); ధన్వాని=ధనువులకు గల అల్లెత్రాళ్ళను; సహస్ర యోజనే=సహస్ర యోజన పర్యంతము; అవతన్మసి=వ్యాప్తములు చేసి ఉంచినావు.

రుద్రావతారులు కొందరు లౌకిక వైదిక పథ ప్రదర్శకులు. కొందరు రుద్ర మూర్తులు అన్నదాతలు. సర్వులకు అన్నవస్త్ర దాతలు. దానధర్మ పరులు. మరి కొందరు శత్రు నిరోధకులు. మహా యుద్ధ వీరులు. ధర్మ యుద్ధ ప్రియులు. అరి భయంకరులు. వీరందరు సర్వత్ర సర్వదా సర్వథా ధనుస్సులు అంబులు అల్లెత్రాళ్ళు ధరించి శత సహస్ర యోజన పర్యంతం వ్యాప్తమై అంబులు సారించి ప్రకాశిస్తు

న్నారు. వారి ధనుశ్శక్తులను సహస్ర విధాల వ్యాప్తం చేసి పట్టి ఉంచుతున్నారు. అట్టి రుద్ర వీరులకు పాదాభివందనాలు.

ఓం యే తీర్థాని ప్రచరంతి సృకావంతో నిషంగిణః

— నవమ ఋక్కు

యే=ఏ రుద్రదేవులు; తీర్థాని=కాశీ ప్రయాగాది తీర్థ ప్రదేశాలను: రక్షితుమ్=రక్షించుటకై ; సృకావంతః=పదునైన ఆయుధాలు కలవారై ; నిషంగిణః=ఖడ్గ యుక్తులై సంచరించుచున్నారో; తే షామ్=ఆ రుద్రుల యొక్క (రూపంతో నీవు); ధన్వాని=ధనువుల అల్లెత్రాళ్ళు; సహస్ర యోజనే=సహస్ర యోజన పర్యంతము; అవతన్మసి=వ్యాప్తము చేసి పట్టిన వాడవై యున్నావు.

రుద్రాంశవీరులు కాశీప్రయాగాది పుణ్యతీర్థ ప్రదేశాలలో యాత్రాపరుల ప్రాణ ధనరక్షణకై సంచరిస్తుంటారు కొందరు తీక్ష్ణ ఆశుగాలు ధరించి ఉంటారు. కొందరు ఖడ్గాలు పూని ఉంటారు. కొందరు గుప్త ఆయుధాలు పట్టి అప్రమత్తులై ఉంటారు.

మరికొందరు రక్షకభటులు. కొందరు గూఢ చారులు. కొందరు పాంధజన వేషధారులు. వారు పవిత్రతను కాపాడతారు. వారందరు కనిపించక ధనుర్బాణాలు అల్లెత్రాళ్ళు ధరించి సహస్ర యోజన దూర పర్యంతం వింటినారి ప్రయోగిస్తూ అరి భయంకరులై ఉంటారు. వారు ధనుశ్శక్తులను ఉపాసించి వ్యాప్తము చేసి పట్టి ఉంచు తున్నారు.

ఓం య ఏతావంతశ్చ భూయాగ్ంసశ్చ దిశోరుద్రా వితస్థిరే
తేషాగ్ం సహస్ర యోజనేఽవ ధన్వాని తన్మసి

— దశమ ఋక్కు

యే రుద్రాః=ఏ రుద్రులు; ఏతావంతశ్చ=పూర్వము చెప్పబడిన వారును; భూయాంసశ్చ=వారి కంటె అధికులైన రుద్ర విశేష మూర్తులను; దిశః=సర్వ దిక్కుల యందు; వితస్థిరే=ప్రవేశించియున్నవారును ఎవరో; తేషామ్=ఆ రుద్ర దేవుల యొక్క (రూపంతో నీవు); ధన్వాని=ధనువులకు గల అల్లెత్రాళ్ళు: సహస్ర యోజన పర్యంతము; అవతన్మసి=వ్యాప్తములు చేసి పట్టినవాడవై యున్నావు.

ఈ రుద్రాంశ అవతార మూర్తులు సహస్ర సహస్రాలు. ఇంతకంటె కూడా అధిక సంఖ్యాకులు. వారు సర్వ దిక్కుల నిండ వ్యాప్తమై యున్నారు. వారు అందరు పైకి కనపడకుండా ధనుస్సులను అంబులను అల్లెత్రాళ్ళ ధరించియున్నారు. వారు శత సహస్ర యోజన పర్యంతం అంబులు సారించి యున్నారు. వారు ధనుశ్శక్తులను ఉపాసించి నిలిపి పట్టి ఉంచారు.

ఓం నమో రుద్రేభ్యో యే పృథివ్యాం యేఽంతరిక్షే యేదివి
యేషా మన్నం వాతో వర్షమ్ ఇషవస్తేభ్యో
దశ ప్రాచీర్దశ దక్షిణా దశప్రతీచీ ర్దశోదీచీ
దశోర్ధ్వాః తేభ్యో నమస్తేనో మృడయంతు
తే యం ద్విష్మో యశ్చనో ద్వేష్టి తం వో జంభే దధామి

— ఏకాదశ యజుస్సు

యే=ఏ రుద్రదేవులు; పృధివ్యామ్- వ ర్తంతే=భూమియందు ఉంటున్నారో; ఏ షామ్=ఏ రుద్రదేవతలకు; అన్నమ్ ఇషవః=అన్నము బాణములో; తేభ్యః= అన్నమే బాణముగా గల ఆ రుద్రుల కొరకు; దశప్రాచీః=పది అంగుళులు ప్రాగగ్రములుగాను; దశదక్షిణా=పది అంగుళులు దక్షిణాగ్రములు గాను; దశప్రతీచీః= పది అంగుళులు పశ్చిమాగ్రములు గాను; దశఉదీచీః=పది అంగుళులు ఉత్తరాగ్రములు గాను; దశ ఊర్ధ్వాః=ఊర్ధ్వ దిశాగ్రములు గాను; నమః అస్తు=నమస్కారమగుగాక!; తే=ఆ రుద్రదేవులు; నః మృడయంతు=మమ్ము సుఖింప చేయుదురుగాక!; తేయం ద్విష్మః=మేము ఎవరిని ద్వేషించుచున్నామో; యశ్చనః ద్వేష్టి= ఎవరు మమ్ము ద్వేషించుచున్నారో; హే రుద్రా!=ఓ రుద్రులారా!; తమ్=ఆ ఉభయులను; వః జంభే దధామి=మీ నోటిలో ఆహుతి చేయుచున్నాము.

ఓ రుద్రా! గుణభద్రా! దయా సముద్రా! నీ వారైన రుద్రాంశ అవతార మూర్తులు కొందరు ఈ భూ ప్రదేశంపై సంచరిస్తున్నారు. వారు అన్నపదార్థాలే బాణాలుగా గలవారు. వారు అపథ్యాన్నం చౌర్యాన్నం ఆదిగా గల దూషితాన్నం

ఘటించిన వారికి వ్యాధుల రూపంలో అన్న బాణాలు గ్రుచ్చి శిక్షిస్తుంటారు. నేను ఆ రుద్రదేవులకు ప్రాగ్దక్షిణ పశ్చిమోత్తరోర్ధ్వ దిశల కభిముఖంగా నిలిచి కరాగ్రాలు చాచి ప్రణవాంజలి ఘటించి నమస్సులర్పింతును గాక! ఆ మహాదేవ రూపులు మమ్ము సదా సుఖపెట్టు గాక!

ఓ రుద్రదేవా! ఉదాసీనులుగా ఉన్న పరులను ద్వేషించునట్టి మా అల్ప బుద్ధులను- ఉదాసీనులుగా ఉన్న మమ్ము ద్వేషించు శత్రుపక్షం వారలను- రెండు తెగల వారిని తెరచిన నీ వదన గహ్వరంలో పడద్రోయుదుముగాక!

యే = ఏ రుద్రదేవతలు; అంతరిక్షే = అంతరిక్షమందు; వర్తంతే = ప్రవర్తించు చున్నారో; యేషామ్ = ఏ రుద్రమూర్తులకు; వాతః = వాయువు; ఇషవః = బాణములో; తేభ్యః రుద్రేభ్యః = ఆ అంతరిక్ష రుద్రులకొరకు; దశప్రాచీః = పది అంగుళులు ప్రాగగ్రములుగాను; దశదక్షిణా = పది అంగుళులు దక్షిణాగ్రములుగాను; దశప్రతీచీః = పది అంగుళులు పశ్చిమాగ్రములుగాను; దశఉదీచీః = పది అంగుళులు ఉత్తరాగ్రములుగాను; దశ ఊర్ధ్వాః = పది అంగుళులు ఊర్ధ్వాగ్రములుగాను; నమః అస్తు = నమస్సు అగుగాక; తే = రుద్రదేవులు; నః మృడయంతు = మమ్ము సుఖ పెట్టుదురుగాక:; తేయంద్వేష్మః మేము ఎవరిని ద్వేషించుచున్నామో; యశ్చనః ద్వేష్టి = ఎవరు మమ్ము ద్వేషించుచున్నారో; హే రుద్రాః = ఓ రుద్రదేవులారా; ! తమ్ = ఆ ఉభయులను; వః జంభే దధామి = మీ నోటిలో త్రోసివేయుదుముగాక!.

ఓరుద్రా! గుణభద్రా! దయాసముద్రా! నీ వారైన కొందరు రుద్రులు అంత రిక్షమందు సంచరిస్తునారు. వారు వాయువులే బాణాలుగా గలవారు. వారు వ్యాధి వ్యాపక దుర్గంధ దూషిత దుష్టలోకవాసులను హవిర్భాగ దూషితులను కలుషిత ధూమపాన సేవితులను హింసిస్తుంటారు. నేను ఆ రుద్రదేవులకు ప్రాగ్దక్షిణ పశ్చిమోత్తరోర్ధ్వ దిశలకు అభిముఖంగా నిలిచి కరాగ్రాలు పదీ చాచి ప్రణవాంజలి ఘటించి నమస్సు లర్పింతునుగాక!

ఓ రుద్రదేవా! ఉదాసీనులుగాఉన్న పరులను ద్వేషించు మా అల్ప బుద్ధులను, ఉదాసీనులుగానున్న మమ్ము ద్వేషించు శత్రుపక్షం వారలను, రెండు తెగలవారిని నీ తెరచిన వదన గహ్వరంలో పడద్రోయుదుముగాక !

యే = ఏ రుద్రదేవతలు; దివి = ద్యోలోకమందు; వర్తంతే = ప్రవర్తిల్లు చున్నారో; యేషామ్ = ఏ రుద్రదేవతలకు; వర్షమ్ః ఇషవః = వర్షము బాణములో;

తేభ్యః రుద్రేభ్యః=ఆ ద్యోలోక రుద్రుల కొరకు; దశప్రాచీః = పది అంగుళులు ప్రాగగ్రములుగాను; దశదక్షిణా = పది అంగుళులు పశ్చిమాగ్రములుగాను; దశఉదీచీః=పది అంగుళులు ఉత్తరాగ్రములుగాను; దశఊర్ధ్వాః=పది అంగుళులు ఊర్ధ్వాగ్రములుగాను; నమః అస్తు=నమస్సు అగుగాక; తే = ఆ రుద్రదేవులు; నః మృడయంతు=మమ్ము సుఖపెట్టుదురుగాక!; తే యమ్ ద్విష్మ=మేము ఎవరిని ద్వేషించుచున్నామో; యశ్చనః ద్వేష్టి = ఎవరు మమ్ము ద్వేషించుచున్నారో; హే రుద్రాః=ఓ రుద్రదేవులారా !; తమ్=ఆ ఉభయులను; వః=మీ యొక్క; జంభే=తెరచిన పెద్దనోటియందు; దధామి=ఆహుతి చేయుదుముగాక !

ఓ రుద్రా! గుణభద్రా! దయసముద్రా! నీ వారైన కొందరు రుద్రాంశ సంభూతులు ద్యోలోకలో సంచరిస్తున్నారు. వారు వర్షధారలే బాణాలుగా గలవారు. వారు అతివృష్టి అనావృష్టి మొదలైనవి కల్పించి వర్షదేవ పూజోత్సవ విముఖులను యజ్ఞ విధ్వంసులను నాస్తికులను బాధిస్తుంటారు. నేను ఆ రుద్రదేవులకు ప్రాగ్దక్షిణ పశ్చిమోత్తర ఊర్ధ్వదిశల కభిముఖంగా నిలిచి కరాగ్రాలు పదిచూచి అంజలి ఘటించి నమోవాకాలు సమర్పింతునుగాక! ఆ రుద్రమూర్తులు మమ్ము సుఖపెట్టుగాక!

ఈశానదేవా! ఉదాసీనులుగా ఉన్న పతులను ద్వేషించు మా తాలూకు అల్ప బుద్ధులను; ఉదాసీనులుగానున్న మమ్ము ద్వేషించు శత్రుపక్షం వారలను, రెండు తెగలవారిని తెరచిన నీ వదన గహ్వరంలో పడద్రోయుదుము గాక ! శివం భవతు.

# చ మ క మ్

## ప్రథమోఽనువాకః

ఓమ్ అగ్నా విష్ణూ !
సజోషసేమా వర్ధంతు వాం గిరః
ద్యుమ్నై ర్వాజేభి రాగతమ్
వాజశ్చమే ప్రసవశ్చమే ప్రయతిశ్చమే
ప్రసితిశ్చమే ధీతిశ్చమే క్రతుశ్చమే
స్వరశ్చమే శ్లోకశ్చమే శ్రావశ్చమే శ్రుతిశ్చమే
జ్యోతిశ్చమే సువశ్చమే ప్రాణశ్చమేఽపానశ్చమే
వ్యానశ్చమేఽసుశ్చమే చిత్తంచమ
ఆధీతంచమే వాక్చమే మనశ్చమే
చక్షుశ్చమే శ్రోత్రంచమే దక్షశ్చమే
బలంచమ ఓజశ్చమే సహశ్చమ
ఆయుశ్చమే జరాచమ ఆత్మాచమే
తనూశ్చమే శర్మచమే వర్మచమేఽంగానిచ
మేఽస్థానిచమే పరూగ్ంషిచమే శరీరాణిచమే

## ప్రథమ అనువాకము

### సర్వేంద్రియ శక్తి

అగ్నావిష్ణూ=అగ్నిదేవ విష్ణుదేవులారా, సజోషసా = మీరు సంప్రీతిని పొంది, వామ్ ఇమా=మీయీ, గిరః=వాక్కులు, వర్ధంతు=వృద్ధిపొందుగాక, మీరు, ద్యుమ్నైః=ధనములతోను, వాజిభిః=ఆహారములతోను, ఆగతమ్=విచ్చేయుదురు గాక.

వాజః=అన్నము, ప్రసవః=అన్నము కొఱకు అనుమతి, ప్రయతిః=అన్న శుద్ధి, ప్రసితిః=అన్నాన్నసక్తి, ధీతిః=అన్నధారణశక్తి, క్రతుః=ఆహారము కొఱకు యజ్ఞము, మే=నాకు, కల్పంతామ్=కలుగునుగాక.

స్వరః=ఉదాత్త అనుదాత్తాది స్వరములు, శ్లోకః=స్తోత్రము, శ్రావః=శ్రవణ శక్తి, శ్రుతిః=వినికిడిశక్తి, జ్యోతి=తేజశ్శక్తి, మే=నాకు, కల్పంతామ్=కలుగును గాక.

సువః = స్వర్గలోకము, ప్రాణః అపానః వ్యానః = ఈ మూడు వాయు వ్యాపార భేదాలలోని, అసుః=అంతశ్శక్తి, చిత్తం=మనోవిజ్ఞానము, అధీతమ్= మనోవిజ్ఞానద్రవ్యము, మే=నాకు, కల్పంతామ్=కలుగుగాక.

వాక్=వాగింద్రియం, మనః=మనస్సు, చక్షుః=నేత్రేంద్రియం, శ్రోత్రమ్= శ్రోత్రేంద్రియం: దక్షః=జ్ఞానేంద్రియశక్తి: బలమ్=కర్మేంద్రియశక్తి: ఓజః=బలం వృద్ధిచేసే అష్టమధాతువు: సహః=శత్రువులను ఎదుర్కొను శక్తి: ఆయుః= ఆయుస్సు, జరా=వృద్ధాప్యము, మే=నాకు, కల్పంతామ్=కలుగునుగాక, ఆత్మా= ఆత్మబలము: తనూ=దేహము: శర్మ=సుఖము: వర్మ=కవచము: అంగాని= అవయవములు, అస్థాని=అస్థులు: మే=నాకు: కల్పంతామ్ = కలుగునుగాక: పరూంషి = వ్రేళ్ళు, కణుపులు: శరీరాణి = దేహావయవములు, మే = నాకు: కల్పంతామ్=కలుగుగాక.

ఓ అగ్నిదేవా! విష్ణుదేవా! మంగళమూర్తులారా! మహానుభావులారా! మా స్తోత్రములు ఫలించుగాక! తమరు సంప్రీతిచెందుదురుగాక! ఆర్థిక సంపదలు, ఆహార విశేషాలతో మీరు మా గృహములకు విచ్చేయుదురుగాక ! పరబ్రహ్మ స్వరూపమైన ఆహారము, ఆహార సమృద్ధి, అన్నశుద్ధికై మంత్రశక్తి, అన్న హేతువైన యజ్ఞ ఫలం నాకు మీరు ప్రసాదింతురుగాక!

ఓ దేవతలారా ! మంత్రోచ్చారణకు సమర్థములైన ఉదాత్త అనుదాత్త స్వరాలు, శ్లోకాలు, చక్కని వాక్కు, వినికిడిశక్తి, దివ్య తేజస్సును దర్శించేశక్తి స్వర్గలోక సౌఖ్యం నాకు లభించుగాక! ప్రాణ అపాన వ్యానాది వాయు భేదాలలోని అంతశ్శక్తి మనోవిజ్ఞానము నాకు కలుగుగాక ! వాక్ కౌశలము, మనోబలము, చక్షుర్దీప్తి, వినికిడిశక్తి ఈ విధమైన జ్ఞానేంద్రియ దక్షత, కర్మేంద్రియములకు పుష్టితుష్టి, దీర్ఘాయువు, వృద్ధాప్యము నాకు ప్రాప్తించునుగాక!

సర్వశాస్త్ర సమ్మోదమైన ఆత్మబలము నాకు సంపన్నమగునుగాక ! దేహబలము, సౌఖ్యము, ఆ సౌఖ్యమునకు రక్ష, శరీరఅంగాలు, ప్రత్యంగాలు, బలవర్ధకములైన అస్థి సముదాయములు శరీరములోని ప్రేవులు, కణుపులు, సమస్త అవయవములు నాకు సంపన్నమగునుగాక !

* *

ఓ అగ్నిదేవా !

దివిషద్వర్గము నీ ముఖమ్మునను ప్రీతింగాంచు! నిన్నీశుగా
స్తవముల్ సేయు శ్రుతుల్ — సమస్త జగదంతర్యామివిన్నీవ- ఆ
హవనీయంబును- దక్షిణాగ్నియును నీ యందుద్భవించున్ — క్రతూ
త్సవ సంధాయక ! నన్నుగావగదవే ! స్వాహావధూవల్లభా !

— అల్లసాని పెద్దన

ఓ విష్ణుదేవా !

శ్రీమన్మంగళదేవతా హృదయ వార్ధిపర్వ హర్షోల్లసత్
సోమా! విశ్వసమస్తపోషణ కళాజ్యోతి స్వరూపా! పరం
ధామా! ఆర్తజనావతీర్ణధిషణా తాత్పర్య కల్పద్రుమా !
స్వామీ! శ్రీహరి! విష్ణుదేవర నమస్కార ప్రసూనాంజలుల్ !

— శాంతిశ్రీ

## ద్వితీయోఽనువాకః

ఓం జ్యైష్ఠ్యంచమ ఆధిపత్యంచమే
మన్యుశ్చమే భామశ్చ
మేఽమశ్చమేఽంభశ్చ మే
జేమాచమే మహిమాచమే
వరిమాచమే ప్రథిమాచమే
వర్ష్మాచమే ద్రాఘుయాచమ్మే

వృద్ధంచమే వృద్ధిశ్చమే
సత్యంచమే శ్రద్ధాచమే జగచ్చమే
ధనంచమే వశశ్చమే త్విషిశ్చమే
క్రీడాచమే మోదశ్చమే
జాతంచమే జనిష్యమాణంచమే
సూక్తంచమే సుకృతంచమే
విత్తంచమే వేద్యంచమే
భూతంచమే భవిష్యచ్చమే
సుగంచమే సుపథంచమ
ఋద్ధంచమ ఋద్ధిశ్చమే
క్లప్తంచమే క్లప్తిశ్చమే
మతిశ్చమే సుమతిశ్చమే

## ద్వితీయ అనువాకము

## సత్కర్మఫలము

జ్యేష్ఠః=సుప్రశస్తి; ఆధిపత్యమ్=ప్రభుత్వము; మన్యుః=అంతఃక్రోధము; భామః=బాహ్య క్రోధము; అమః=అప్రమేయత్వము; అంభః=జలము; జేమా=జయశక్తి; మహిమా=సంపద; వరిమా=పూజ్యత; ప్రదిమా=భవనశోభ; వర్ష్మ=శరీరపుష్టి; ద్రాఘుయా=వంశ వృద్ధి; వృద్ధమ్=అధికాహారము; మే కల్పంతామ్=నాకు లభించుగాక!

వృద్ధిః=విద్యాభి వృద్ధిపై ఉత్కర్ష; సత్యం=యదార్థవాక్కు; శ్రద్ధా=ఇహ పరాలపై విశ్వాసము; జగత్=గోధనము; ధనమ్=సువర్ణాదులు; వశః=వశీకరణ శక్తి; త్విషిః=దేహ కాంతి; మే=నాకు; కల్పంతామ్=లభించుగాక! క్రీడా=క్రీడలు: మోదః=క్రీడా సంతోషము; జాతం=కలిగిన సంతానము; జనిష్యమాణం=కలుగ

బోవు సంతానము; సూ క్తం=ఋక్కుల అభ్యాసము; సుకృతమ్=పుణ్య విశేషము; మే కల్పంతామ్=నాకు లభించుగాక!

వి త్తం=ప్రాప్తించిన ద్రవ్యము; వేద్యం=రాబోవు ద్రవ్యము; భూతం=ప్రాప్తించిన క్షేత్రాదులు; భవిష్యం=రాబోవు క్షేత్రాదులు; సుగమ్=బంధుజనం; సుపథమ్=మంగళకర మార్గం; మే=నాకు; కల్పంతాం=ప్రాప్తించునుగాక. ఋద్ధం=ధనాదికములు; క్ల ప్తం=సత్కార్యార్జిత ద్రవ్యం; క్ల ప్తి=సమర్థత; మతి=పదార్థ నిశ్చయ జ్ఞానం; సుమతి=దుర్ఘటన కార్యనిశ్చయ జ్ఞానం; మే కల్పంతాం=నాకు కలుగుగాక!

ఓ దేవతలారా! నాకు సుప్రశస్తిని ప్రసాదించండి. ఆధిపత్యము, అంతరింద్రియ, బహిరింద్రియముల నదుపులో నుంచుకొనుటకై వాటిపై కోపము నాకు కలుగుగాక. శత్రువులకు నిరూపించుటకు వీలుకాని అప్రమేయత్వము, చల్లని స్వాదు జలము నాకు ప్రాప్తించునుగాక. సర్వకార్య జయసిద్ధి, సంపద, పూజ్యత, గృహ క్షేత్ర సౌభాగ్యము, శరీరపుష్టి, వంశవృద్ధి, చక్కని ఆహారము నాకు ప్రాప్తించుగాక.

విద్యాభివృద్ధిపై ఉత్కర్ష, యదార్థ వాక్కు, ఇహపరములపై విశ్వాసము, గోసువర్ణ ధనాలు, ఆరోగ్యము నాకు కలుగుగాక! క్రీడల యెడల సంతోషము కలిగిన సంతానము, కలుగబోవు సంతానము, ఋక్కుల అభ్యాసము, పుణ్య విశేషము నాకు కలుగుగాక.

ప్రాప్తించిన ధనము, ప్రాప్తింపబోవు ధనము. ప్రాప్తించిన క్షేత్రాదులు, ప్రాప్తింపబోవు క్షేత్రాదులు, బంధువులు, మంగళకర మార్గములు నాకు లభించును గాక! అభివృద్ధిని కలిగించే ధనాదికములు, చేసిన దానధర్మ ఫలములు, సమర్థత, మతి సుమతులు నాకు ప్రాప్తించును గాక!

## తృతీయోఽనువాకః

ఓం శంచమే మయశ్చమే
ప్రియంచమేఽనుకామశ్చమే
కామశ్చమే సౌమనసశ్చమే

భద్రంచమే శ్రేయశ్చమే
వస్యశ్చమే యశశ్చమే
భగశ్చమే ద్రవిణంచమే
యంతాచమే ధర్తాచమే
క్షేమశ్చమే ధృతిశ్చమే విశ్వంచమే మహశ్చమే
సంవిచ్చమే జ్ఞాత్రంచమే
సూశ్చమే ప్రసూశ్చమే
సీరంచమే లయశ్చమ
ఋతంచమేఽమృతంచమేఽ
యక్ష్మంచమేఽనామయశ్చమే
జీవాతుశ్చమే దీర్ఘాయుత్వంచ
మేఽనమిత్రంచ మేఽభయంచమే
సుగంచమే శయనంచమే
సూషాచమే సుదినంచమే

## తృతీయ అనువాకము

### సుఖ సంపత్సమృద్ధి

శమ్=ఐహిక సుఖం; మయః=పరలోక సుఖం; ప్రియమ్=సంతోషకర వస్తువు; అనుకామః=అనుకూలంగా కోరుకొను వస్తువులు; కామః=ఆముష్మిక స్వర్గ భోగాలు; సౌమనసః=మనస్సుకు ఆహ్లాదం కలిగించు బంధువర్గం; భద్రమ్=ఇహ లోక రమణీయ వస్తుజాలం; శ్రేయః=పరలోక హిత సౌఖ్య సంపద; వస్యః=వాసయోగ్య భవనాదులు; యశః=యశస్సు; భగః=సౌభాగ్యం; ద్రవిణమ్=ధనం;

యంతా = యజమాన ఆచార్యాదులను; ధర్తా = పోషకులగు తల్లిదండ్రులను సేవించు శక్తి; క్షేమః = ఉన్నధనం కాపాడుకొను శక్తి; ధృతిః = ధైర్యంగా ఉండు శక్తి; విశ్వమ్ = సర్వులకు అనుకూలుడై యుండు శక్తి; మే = నాకు; కల్పంతామ్ = కలుగు గాక!

మహః = పూజ; సంవిత్ = వేదశాస్త్ర జ్ఞానం; జ్ఞాత్రమ్ = ఇతరులకు జ్ఞానబోధ చేయు సామర్థ్యం; సూః = పుత్రులకు బోధించు సామర్థ్యం; ప్రసూనః = భృత్యాదులకు బోధించు నేర్పు; సీరమ్ = నాగళ్ళు కొడవళ్ళు మొదలగు వ్యవసాయపు సాధన సంపత్తి; లయః = వాని ప్రతిబంధముల నాశం; మే = నాకు; కల్పతామ్ = కలుగుగాక!

ఋతమ్ = యజ్ఞాది కర్మల ఫలం; అమృతమ్ = యాగఫలం; అయక్ష్మమ్ = రాజయక్ష్మాది రోగ నివారణం; అనామయమ్ = జ్వరాదులు లేని ఆరోగ్యం; జీవాతుః = జీవించుటకు ఔషధాలు; దీర్ఘాయుత్వమ్ = అపమృత్యు నివారకమైన దీర్ఘాయువు; మే = నాకు; కల్పంతామ్ = కలుగుగాక!; అనమిత్రమ్ = శత్రు రాహిత్యం; అభయమ్ = భయరాహిత్యం; సుగమ్ = సత్ప్రవర్తనం; శయనమ్ = శయ్యా సౌఖ్య సంపత్తి; సూషా = శుభోదయం; సుదినమ్ = శుభకరమైన దినములు; మే కల్పంతామ్ = నాకు ప్రాప్తించుగాక!

ఓ అగ్ని విష్ణు దేవతలారా! ఇహలోక సుఖములు, పరలోక సుఖములు సమస్తము నాకు ప్రసాదించవలసింది. మనస్సునకు ఆహ్లాదం కలిగించే బంధువర్గము రమణీయ వస్తుజాలము, భవనములు, యశస్సు, సౌభాగ్యము, ధనము, తల్లిదండ్రులను, ఆచార్యాదులను సేవించు శక్తి, ధన ధాన్యాదులను కాపాడుకొనే ధైర్యము, అందరికీ అనుకూలంగా ఉండే నేర్పు నాకు కలుగుగాక!

వేదశాస్త్ర జ్ఞానము, జ్ఞానబోధ చేసే సామర్థ్యము, పుత్రులకు బోధించే సామర్థ్యము, వ్యవసాయ సాధన సంపత్తి నాకు కలుగుగాక. యజ్ఞ యాగాదుల ఫలం, అనారోగ్యాలు లేని చక్కని ఆరోగ్యం, ఎక్కువ ఆయుష్షు, మంచి ఔషధాలు నాకు సమకూరును గాక! శత్రు రాహిత్యం, భయ శూన్యత, సత్ప్రవర్తనం, సౌఖ్యము, శుభప్రదమైన దినములు నాకు కలుగుగాక!

## చతుర్థోఽనువాకః

ఓం ఊర్క్చమే సూనృతాచమే
పయశ్చమే రసశ్చమే
ఘృతంచమే మధుచమే
సగ్ధిశ్చమే సపీతిశ్చమే
కృషిశ్చమే వృష్టిశ్చమే
జైత్రంచమ ఔద్భిద్యంచమే
రయిశ్చమే రాయశ్చమే
పుష్టంచమే పుష్టిశ్చమే విభుచమే ప్రభుచమే
బహుచమే భూయశ్చమే
పూర్ణంచమే పూర్ణతరంచ
మేఽక్షితిశ్చమే కూయవాశ్చ
మేఽన్నంచమేఽక్షుచ్చమే
వ్రీహయశ్చమే యవాశ్చమే
మాషాశ్చమే తిలాశ్చమే
ముద్గాశ్చమే ఖల్వాశ్చమే
గోధుమాశ్చమే మసురాశ్చమే
ప్రియంగవశ్చమేఽణవశ్చమే
శ్యామాకాశ్చమే నీవారాశ్చమే

### చతుర్థ అనువాకము
### ఆహార సమృద్ధి

ఊర్క్=అన్నం; సూనృతా=ప్రియవచనం; పయః=పాలు; రసః=రసం; ఘృతమ్=నెయ్యి; మధు=తేనె; సగ్ధిః=బంధు సహితమైన భోజన సేవనం;

సపీతిః = బంధు సహితమైన పానీయ సేవనం: కృషిః = సేద్యం: వృష్టిః = వర్షం: మే = నాకు: కల్పంతామ్ = కలుగుగాక!

క్షైత్రమ్ = అన్ని క్షేత్రాలను జయించునది సుక్షేత్రం: ఔద్భిద్యమ్ = వృక్ష గుల్మాదులు పుట్టునట్టిది: రయిః = బంగారం: రాయః = రత్నాదులు: పుష్టమ్ = సమృద్ధ సువర్ణం: పుష్టిః = దేహపోషణ: విభు = అధిక ధాన్యం: ప్రభు = అధికతర ధాన్యం: బహు = ఇంకనూ ఎక్కువ ధాన్యం: భూయః = బహుకంటె ఎక్కువైన ధాన్యం: పూర్ణమ్ = నిండిన ధాన్యం: పూర్ణతరమ్ = మిక్కిలి నిండిన ధాన్యం: అక్షితిః = నశిం పని తరుగనిధాన్యం: మే = నాకు: కల్పంతామ్ = లభించుగాక!

కూయవాః = చిట్టి యవలు: అన్నమ్ = అన్నం: అక్షుత్ = ఆకలిబాధ లేకుండుట అన్నం సమృద్ధిగా యుండుట: వ్రీహయః = వడ్లు: యవాః = యవలు: మాషాః = మినుములు: తిలాః = నువ్వులు: ముద్గాః = పెసలు: ఖల్వాః = సెనగలు: గోధుమాః = కొఱ్ఱలు: అణవః = సన్నవరి: శ్యామాకాః = చామలు: నీవారాః = తృణధాన్యం విశేషం: మే = నాకు: కల్పంతామ్ = కలుగుగాక!

ఓ దేవతలారా! అభివందనములు! సురుచిరమైన అన్నము, సూనృత వాక్య విన్యాసము, మధుర క్షీరము, నెయ్యి, తేనె, బంధువుల తోడి భోజనము, వ్యవసాయము కృషి, వర్షము, హర్షము నాకు సంపన్నమగుగాక! సుక్షేత్రము, చెట్లు చేమలు, సువర్ణము, మణులు, మాణిక్యాలు, శారీరక బలము, వివిధ రకము లైన ధాన్యముల సమృద్ధి నాకు సంప్రాప్తమగుగాక! వరి, యవలు, మినుములు, నువ్వులు, పెసలు, సెనగలు, గోధుమలు, పిల్లిపెసర, మున్నగు ధాన్యములు మాకు ప్రాప్తించుగాక!

## పంచమోఽనువాకః

ఓం అశ్మాచమే మృత్తికాచమే
గిరయశ్చమే పర్వతాశ్చమే
సికతాశ్చమే వనస్పతయశ్చమే
హిరణ్యంచమేఽయశ్చమే

సీసంచమే త్రపుశ్చమే
శ్యామంచమే లోహంచ
మేఽగ్నిశ్చమ ఆపశ్చమే
వీరుధశ్చమ ఓషధయశ్చమే
కృష్ట పచ్యంచ
మేఽకృష్ట పచ్యంచమే
గ్రామ్యాశ్చమే పశవ ఆరణ్యాశ్చ
యజ్ఞేన కల్పంతాం
విత్తంచమే విత్తిశ్చమే
భూతంచమే భూతిశ్చమే
వసుచమే వసతిశ్చమే
కర్మచమే శక్తిశ్చ
మేఽర్థశ్చమ ఏమశ్చమ
ఇతిశ్చమే గతిశ్చమే

## పంచమ అనువాకము

### భూ సమృద్ధి

అశ్మా=రాయి; మృత్తికా=మట్టి; గిరయః=కులగిరులు; పర్వతాః=ఇతర పర్వతాలు; సికతాః=ఇసుక ములు; వనస్పతయః=వృక్షాలు; హిరణ్యమ్=బంగారం, వెండి; అయః=ఇనుము; సీసమ్=సీసం; త్రపుః=తగరం; శ్యామమ్=కారు ఇనుం; లోహమ్=లోహం; మే=నాకు; కల్పంతామ్=కలుగుగాక!

అగ్నిః=నిప్పు; అపః=నీరు; వీరుధః=లతలు; ఓషధయః=ఓషధుల మొక్కలు; కృష్టపత్యమ్=దున్ని పండించు ధాన్యం కృష్ణ వరి వంటివి; అకృష్ణ పత్యమ్=దున్నక పండించు ధాన్యం; మే=నాకు; కల్పంతామ్=కలుగుగాక!;

గ్రామ్యాశ్చ=గ్రామాలలో పుట్టినవి; ఆరణ్యాశ్చ=ఆరణ్యాలలో పుట్టినవి అగు; పశవః=పశువులు; యజ్ఞేన=యజ్ఞంచేత; కల్పంతామ్=సంప్రాప్తమగుగాక!; ఈ పశువులు యజ్ఞ కర్మకు ఉపయోగ పడుగాక;

విత్తమ్=పూర్వమున లభించిన ధనం; విత్తిః=రాబోవు ధనం; భూతమ్=ఐశ్వర్య జాతకులగు పుత్రులు; భూతిః=స్వకీయధనం; వసుః=వాసయోగ్యమగు గోవులు మొదలైనవి; వసతిః=గృహాదులు; కర్మ=అగ్నిహోత్ర కర్మ క్రతువులు; శక్తిః=వానిని అనుష్ఠించు శక్తి; అర్థః=ప్రయోజనం; ఏమః=పొందవలసిన సుఖ సంపద: ఇతిః=ఇష్ట కామ్యములు పొందు ఉపాయం; గతిః=ఇష్టప్రాప్తి: మే=నాకు; కల్పంతామ్=ప్రాప్తించుగాక!

ఓ దేవతలారా! ప్రణామములు. నేల, రాయి, పర్వతాలు, ఇసుక నేలలు, చెట్లు చేమలు, బంగారము, వెండి, ఇనుము, సీసము, తగరము, సమస్తము నాకు ప్రాప్తించుగాక! నిప్పు, నీరు, లతలు, ఓషధులు, ధాన్యాలు, గ్రామాలలో పుట్టిన ఆరణ్యాలలో పుట్టిన పశువులు యజ్ఞంచేత నాకు ప్రాప్తించునుగాక! లభించిన ధనం, లభించబోవు ధనం, పుత్రులు, గోవులు, గృహాలు, క్రతువులొనర్చు శక్తి, వాటి ఫలములు, ఇష్టప్రాప్తి నాకు కలుగుగాక!

## షష్ఠోఽనువాకః

ఓం అగ్నిశ్చమ ఇంద్రశ్చమే
సోమశ్చమ ఇంద్రశ్చమే
సవితాచమ ఇంద్రశ్చమే
సరస్వతీచమ ఇంద్రశ్చమే
పూషాచమ ఇంద్రశ్చమే
బృహస్పతిశ్చమ ఇంద్రశ్చమే
మిత్రశ్చమ ఇంద్రశ్చమే
వరుణశ్చమ ఇంద్రశ్చమే

త్వష్టాచమ ఇంద్రశ్చమే
ధాతాచమ ఇంద్రశ్చమే
విష్ణుశ్చమ ఇంద్రశ్చ
మేఽశ్వినౌచమ ఇంద్రశ్చమే
మరుతశ్చమ ఇంద్రశ్చమే
విశ్వేచమేదేవా ఇంద్రశ్చమే
పృథివీచమ ఇంద్రశ్చ
మేఽంతరిక్షంచమ ఇంద్రశ్చమే
ద్యౌశ్చమ ఇంద్రశ్చమే
దిశశ్చమ ఇంద్రశ్చమే
మూర్ధాచమ ఇంద్రశ్చమే
ప్రజాపతిశ్చమ ఇంద్రశ్చమే

## షష్ఠ అనువాకము
## సర్వదేవ ఇంద్ర బలం

ఈ ప్రసిద్ధ దేవతలందరితో ఇంద్రుడు సమాన భాగం గలవాడు- అందరితో కలిసి ఉంటాడు. అగ్నిః=అగ్ని; ఇంద్రః=ఇంద్రుడు; సోమః=చంద్రుడు; సవితా=సూర్యుడు; సరస్వతీ=సరస్వతీదేవి; పూషా=పూష యను దేవత; బృహస్పతి=బృహస్పతి దేవత; మిత్రః=మిత్రుడు; వరుణః=వరుణుడు; త్వష్టా=విశ్వకర్మ; ధాతా=దేవతా విశేషం బ్రహ్మ; విష్ణుః=విష్ణుదేవత; అశ్వినీ=అశ్వినీ దేవతలు; మరుతః=వాయువులు; విశ్వేదేవాః=విశ్వదేవులు; పృథివీ=భూమి; అంతరిక్షమ్=ఆకాశం; ద్యౌః=స్వర్గం; దిశః=దిక్కులు; మూర్ధా=ఊర్ధ్వ దిక్కు; ప్రజాపతిః=ప్రజాపతి; మే కల్పంతామ్=నాకు అభిముఖులగుగాక!

అగ్నిదేవుడు నాకు ప్రసన్నుడగుగాక! ఇంద్రదేవుడు నన్నునుగ్రహించుగాక. సోముడు ఇంద్రుడు, సూర్యుడు ఇంద్రుడు, సరస్వతి ఇంద్రుడు నాకు ప్రసన్నులగు

దురు గాక! అదిత్యులలో ఒకరైన పూషదేవుడు మరియు ఇంద్రుడు, బృహస్పతి మరియు ఇంద్రుడు, ఆదిత్యులలో ఒకరైన మిత్రదేవుడు మరియు ఇంద్రదేవుడు, వరుణుడు మరియు ఇంద్రుడు, త్వష్టృదేవుడు మరియు ఇంద్రుడు నాకు సంపన్నులగుదురుగాక!

బ్రహ్మదేవుడు మరియు ఇంద్రుడు, విష్ణుదేవుడు మరియు ఇంద్రుడు, అశ్వినీ దేవతలు ఇంద్రుడు, మరుద్దేవతలు ఇంద్రుడు, విశ్వేదేవతలు ఇంద్రుడు నాకు ప్రసన్నులగుదురుగాక! పృథివీదేవి ఇంద్రదేవుడు, అంతరిక్షాధిపతి ఇంద్రుడు, దివి నాథుడు ఇంద్రుడు, దిక్పాలకులు ఇంద్రుడు ఊర్ధ్వ దిక్పతి ఇంద్రుడు, ప్రజాపతి ఇంద్రుడు నాకు ప్రసన్నులగుదురుగాక! ఇంద్రుడు సర్వదేవతలతోను సమాన భాగము గలవాడు. ఆ ఇంద్రుడు దేవతలందరితోను విచ్చేసి నన్ననుగ్రహించుగాక!

## సప్తమోఽనువాకః

ఓం అగ్ంశుశ్చమే రశ్మిశ్చ
మేఽదాభ్యశ్చ మేఽధిపతిశ్చమ
ఉపాగ్ంశుశ్చ మేఽంతర్యామశ్చమ
ఐంద్రవాయవశ్చమే మైత్రావరుణశ్చమ
ఆశ్వినశ్చమే ప్రతిప్రస్థానశ్చమే
శుక్రశ్చమే మంథీచమ
ఆగ్రయణశ్చమే వైశ్వ దేవశ్చమే
ధ్రువశ్చమే వైశ్వానరశ్చమ ఋతుగ్రహాశ్చ
మేఽతి గ్రాహ్యాశ్చమ
ఐంద్రాగ్నశ్చమే వైశ్వదేవశ్చమే
మరుత్వతీయాశ్చమే మాహేంద్రశ్చమ

ఆదిత్యశ్చమే సావిత్రశ్చమే
సారస్వతశ్చమే పౌష్ణశ్చమే
పాత్నీవతశ్చమే హారియోజనశ్చమే

## సప్తమ అనువాకము

### గ్రహబలం

ఈ సోమ గ్రహ విశేషాలు నాకు అనుకూలమగు గాక!;

అంశుః=అంశు: రశ్మిః=రశ్మి; అదాభ్యః=అదాభ్య; అధిపతిః='అధిపతి' దధి; ఉపాంశుః=ఉపాంశు; అంతర్యామః=అంతర్యామ; ఐంద్రవాయవః=ఐంద్ర వాయవ ఈ మొదలైన గ్రహాలు; మే=నాకు; కల్పంతామ్=అనుకూలమగుగాక!; మైత్రావరుణః=మిత్రుడు, వరుణుడు; అశ్వినః=అశ్విని దేవతలు; ప్రతిప్రస్థానః= ప్రతినిర్గ్రాహ్య గ్రహాలు; శుక్రః=శుక్ర; మంథీ=మంథి; ఆగ్రయణః=ఆగ్రయణ; వైశ్వదేవః=ప్రాతస్సవనగత వైశ్వదేవ; ధ్రువః=ధ్రువ; వైశ్వానరః=వైశ్వానర; ఋతుగ్రహాః=ఋతుగ్రహ; అతిగ్రాహ్యః=అతిగ్రాహ్య; ఐంద్రాగ్నః=ఇంద్రఅగ్ని వైశ్వదేవః=తృతీయ సవనగత వైశ్వదేవ; మరుత్వతీయః = మరుత్వతీయ; మాహేంద్రః=మాహేంద్ర; ఆదిత్యః=ఆదిత్య; సావిత్రః=సావిత్ర; సారస్వతః= సారస్వత; పౌష్ణః=పౌష్ణ; పాత్నీవతః=పాత్నీవత; హారియోజనః=హారియోజన పేర్లుగల ఈ గ్రహాలు సోమ విశేష గ్రహాలు. ఇవి నాకు ప్రసన్నమగుగాక!

అంశు, రశ్మి, అదాభ్య, దధి, ఉపాంశు, అంతర్యామ గ్రహములు నాకు సంపన్నమగుగాక! ఇంద్రవాయు దేవతలు అధిపతులుగా గల ఐంద్రవాయవ గ్రహము నాకు అనుకూలమగుగాక! మైత్రావరుణ గ్రహము, అశ్విన గ్రహము, ప్రతినిర్గ్రాహ్య గ్రహము, శుక్రగ్రహము, మంథిగ్రహము ఆగ్రయణ గ్రహము నాకు ప్రసన్నమగు గాక!

ప్రాతస్సవనగత వైశ్వదేవ గ్రహము నాకు సంపన్నమగుగాక! ధృవ గ్రహము, వైశ్వానర గ్రహము, ఋతు గ్రహములు, అతిగ్రాహ్య గ్రహములు, ఇంద్రాగ్ని గ్రహములు నాకు సంపన్నమగుగాక! తృతీయ సవన గత వైశ్వదేవ గ్రహము, మరుత్వతీయ గ్రహములు, మహేంద్ర గ్రహము, ఆదిత్య గ్రహము, సావిత్ర గ్రహము, సారస్వత గ్రహము, పౌష్ణగ్రహము, పాత్నీవత గ్రహము, హారియోజన గ్రహము నన్ననుగ్రహించుగాక!

## అష్టమోఽనువాకః

ఓం ఇధ్మశ్చమే బర్హిశ్చమే
వేదిశ్చమే ధిష్ణియాశ్చమే
స్రుచశ్చమే చమసాశ్చమే
గ్రావాణశ్చమే స్వరవశ్చమే
ఉపర వాశ్చమేఽధిషవణేచమే
ద్రోణ కలశశ్చమే వాయవ్యానిచమే
పూతభృచ్చమ ఆధవనీయశ్చమ
ఆగ్నీధ్రంచమే హవిర్ధానంచమే
గృహాశ్చమే సదశ్చమే
పురోడాశాశ్చమే
పచతాశ్చమేఽవభృథశ్చమే
స్వగాకారశ్చమే

## అష్టమ అనువాకము

## యజ్ఞ ఉపకరణ సమృద్ధి

ఇధ్మః = ఇధ్మము; బర్హిః = బర్హిస్సు; వేదిః = వేది; ధిష్ణియాః = ధిష్ణియలు స్రుచః = స్రుక్కు-స్రువం-జుహూవులది; చమసాః = చమసా పాత్ర విశేషాలు;

గ్రావాణః=చిన్న చిన్న శిలలు; స్వరవః=స్వరవము; ఉపరవాః=ఉపరవములు; అధిషవణే=ఫలకములు; ద్రోణకలశః=ద్రోణకలశములు పాత్ర విశేషాలు; వాయవ్యాని=వాయుస్తోత్ర మంత్రాలు; పూతభృత్=పూతభృత్తు; ఆధవనీయః=ఆధవనీయము; ఆగ్నీధ్రమ్=ఆగ్నీధ్ర స్థానము; హవిర్ధానమ్=హవిర్ధానము; గృహాః=పత్నీశాల ఆది గృహాలు; సదః=సదస్సులు-మంటపాలు; పురోడాశాః=హవిస్సులు; పచతాః=పచతములు; అవభృథః=యాగాంత స్నానములు; స్వగాకారః=శంయువాకము; మే=నాకు ఇవి; కల్పంతామ్=సంపన్నములగు గాక!

ఇధ్మము బర్హిస్సు, వేది, ధిష్ణియలు, స్రుక్ స్రువము, ద్రోణ కలశములు మొదలైన యజ్ఞాంగ ద్రవ్యములు, పత్నీశాల, సదస్సులు, మంటపాలు, హవిస్సులు నాకు సమృద్ధములై యుండుగాక!

## నవమోఽనువాకః

ఓం అగ్నిశ్చమే
ఘర్మశ్చ మేఽర్కశ్చమే
సూర్యశ్చమే
ప్రాణశ్చమేఽశ్వమేధశ్చమే
పృథివీచమేఽదితిశ్చమే దితిశ్చమే
ద్యౌశ్చమే
శక్వరీ రంగుల యోదిశశ్చమే
యజ్ఞేన కల్పంతా
మృక్చమే సామచమే స్తోమశ్చమే
యజుశ్చమే దీక్షాచమే
తపశ్చమ ఋతుశ్చమే వ్రతంచ
మేఽహోరాత్ర యోర్వృష్ట్యా
బృహద్రథంతరేచమే
యజ్ఞేన కల్పేతామ్

## నవమ అనువాకము

## యజ్ఞ ఫల సమృద్ధి

అగ్నిః=చయనం చేయు వహ్ని: ఘర్మః=ప్రవర్గ్యం: అర్కః=అర్క యాగ విశేషం: సూర్యః=సూర్యయాగం: ప్రాణః=ప్రాణోద్దేశ్యక హోమవిశేషం: అశ్వమేధః=అశ్వమేధయాగం: పృథివీ=పృథ్వి: అదితిః=అదితి దేవత: దితిః= దితి దేవత: ద్యౌః=దివి దేవత: శక్వరీ=ఛందో విశేషాలు: అంగులయః=విరాట్పురుషుని వ్రేళ్ళు అయిన: దిశశ్చ=దిక్కులు విదిక్కులు మూలలు: మే=నా: యజ్ఞేన =యజ్ఞంచేత: కల్పంతామ్=సమర్థవంతములగుత!

ఋక్=ఋగ్వేద మంత్ర విశేషం: సామ=సామవేద మంత్ర విశేషం: స్తోమః=సామావృత్తి స్తోత్రం: యజుః=యజుర్వేద మంత్ర విశేషం: దీక్షా=యజమానుని సంస్కారం: తపః=పాపక్షయ ఉపవాస తపాదులు: ఋతుః=యాగాంత భూతకాలం: వ్రతమ్=వ్రతం: అహోరాత్రయోః=పగలు రాత్రి: వృష్ట్యా=వర్షం చేత: మదీయమ్ సస్యమ్=నా పైరు: కల్పంతామ్=సమర్థమై సమృద్ధి జెందుగాక! బృహద్రథంతరే=సామవేద విశేషాలు: మే=నా: యజ్ఞేన=యజ్ఞంచేత: కల్పంతామ్=సమర్ధవంతమ్ములగుగాక!

చయనం చేసే అగ్ని, ప్రవర్గ్యాది కర్మ విశేషము. సూర్య, అశ్వమేధాది వివిధ యాగ విశేషములు, నాకు ప్రాప్తించుగాక! పృథివి, అదితి, దితి నాకు ప్రసన్నమగుగాక! శర్వరీ ఛందస్సులు, విరాట్పురుషునకు వ్రేళ్ళ వంటివైన దిశలు నా యజ్ఞంచేత సమర్థములగుగాక. ఋక్ సామ యజుర్వేద మంత్ర విశేషములు నా కార్య కలాపము లంను సమర్థములగుగాక దీక్ష, తపస్సు, వ్రతము నాకు చేకూరుగాక. యజ్ఞంవల్ల దివారాత్రములు కురిసిన వర్షముచేత నా పైరు, పంటలు వృద్ధియగుగాక!

## దశమోఽనువాకః

ఓం గర్భాశ్చమే వత్సాశ్చమే
త్ర్యవిశ్చమే త్ర్యవీచమే
దిత్యవాట్చమే దిత్యౌహీచమే

పంచావిశ్చమే పంచావీచమే
త్రివత్సశ్చమే త్రివత్సాచమే
తుర్యవాట్చమే తుర్యౌహీచమే
షష్ఠవాచ్చమే షష్ఠౌహీచమ
ఉక్షాచమే వశాచమ
ఋషభశ్చమే వేహచ్చ
మేఽనడ్వాంచమే ధేనుశ్చమ
ఆయుర్యజ్ఞేన కల్పతాం
ప్రాణోయజ్ఞేన కల్పతా
మపానో యజ్ఞేన కల్పతాం
వ్యానో యజ్ఞేన కల్పతాం
చక్షుర్యజ్ఞేన కల్పతాగ్ం
శ్రోత్రం యజ్ఞేన కల్పతాం
మనోయజ్ఞేన కల్పతాం
వాగ్యజ్ఞేన కల్పతా
మాత్మాయజ్ఞేన కల్పతాం
యజ్ఞో యజ్ఞేన కల్పతామ్

## దశమ అనువాకము

### గోసంపత్సమృద్ధి

గర్భాః=గోగర్భాలు కడుపులోని దూడలు; వత్సాః=వత్సరం వయస్సులోని దూడలు; త్ర్యవిః=ఒకటిన్నరేండ్ల కోడె దూడలు; త్ర్యవీ=ఒకటిన్నరేండ్ల ఆవు దూడలు; దిత్యవాట్=రెండేండ్ల కోడెలు; దిత్యౌహి=రెండేండ్ల పెయ్యలు; పంచావిః =రెండున్నరేండ్ల కోడెలు; పంచిపీ=రెండున్నరేండ్ల పెయ్యలు; త్రివత్సాః=

మూడేండ్ల కోడె; త్రివత్సా=మూడేండ్ల పెయ్య; తుర్యవాట్=మూడున్నరేండ్ల కోడె; తుర్యౌహీ=మూడున్నరేండ్ల అవుదూడ; పష్ఠవాట్=నాలుగేండ్ల కోడె; ఉక్షా=ఈడు వచ్చిన వృషభం; వశా=గొడ్డుటావు; ఋషభః=ఎద్దు; వేహత్=ఈచుకపోవు ఆవు; అనడ్వాన్=బండిలాగు ఎద్దు; ధేనుః=క్రొత్తగా ఈనిన ఆవు; ఇవన్నీ మే=నాకు; కల్పంతామ్=సంపన్నమగుగాక! ఆయుః యజ్ఞేన కల్పంతామ్=ఆయువు యజ్ఞంచే లభించుగాక! ప్రాణః=హృదయ సంచార వాయువు; అపానః=గుద సంచార వాయువు; వ్యానః=నాడీ సంచార వాయువు; చక్షుః=నేత్రాలు; శ్రోత్రమ్=శ్రవణాలు; మనః=మనస్సు; వాక్=వాగింద్రియం; ఆత్మా=శరీరం-శరీరారోగ్యాదులు; యజ్ఞః=చేయబోవు అశ్వమేధాది యజ్ఞాలు; యజ్ఞేన=ఇపుడు చేయు యజ్ఞంచేత; కల్పంతామ్=సంప్రాప్తమగుగాక!

గోవుల గర్భములు, వత్సరము వయస్సు దూడలు, వత్సరమున్నర వయస్సున్న కోడె దూడలు, ఆవుదూడలు! రెండు వత్సరాల కోడె దూడలు ఆవుదూడలు, రెండున్నర వత్సరాల, మూడు వత్సరాల, మూడున్నర, నాలుగు వత్సరాల ఆవు దూడలు, కోడె దూడలు, గిత్త, ఆవు, ఎద్దు మొదలైన గో సంతతి నాకు కలుగుగాక. నా యజ్ఞము చేత వీటికి ప్రాణము, ఆయుష్షు కలుగుగాక. ప్రాణాపానాది వాయువులు, కర్మేంద్రియములు నా యజ్ఞము వల్ల కార్యక్షమమగుగాక.

## ఏకాదశోఽనువాకః

ఓం ఏకాచమే త్రిసశ్చమే
పంచచమే సప్తచమే
నవచమ ఏకాదశచమే
త్రయోదశచమే పంచదశచమే
సప్తదశచమే నవదశచమే
ఏకఽగ్ంశతిశ్చమే త్రయోఽగ్ంశతిశ్చమే
పంచవిగ్ంశతిశ్చమే సప్తవిగ్ంశతిశ్చమే
నవవిగ్ంశతిశ్చమ ఏకత్రిగ్ంశచ్చమే

త్రయస్త్రిగ్ంశచ్చమే చతస్రశ్చ
మేఽష్టౌచమే ద్వాదశచమే
షోడశచమే విగ్ంశతిశ్చమే
చతుర్విగ్ంశతిశ్చమేఽష్టావిగ్ంశతిశ్చమే
ద్వాత్రిగ్ంశచ్చమే షట్త్రిగ్ంశచ్చమే
చత్వారిగ్ంశచ్చమే చతుశ్చత్వారిగ్ంశచ్చ
మేఽష్టాచత్వారిగ్ంశచ్చమే వాజశ్చ ప్రసవశ్చాపిజశ్చ
క్రతుశ్చ సువశ్చ మూర్ధాచ
వ్యశ్నియశ్చాఽఽన్త్యాయనశ్చాన్త్యశ్చ
భౌవనశ్చ భువనశ్చాధిపతిశ్చ

## ఏకాదశ అనువాకము

## సంఖ్యాసమీచీనం

ఏకా = ఒకటి; త్రిసః = మూడు; పంచ = ఐదు; సప్త = ఏడు; నవ = తొమ్మిది ఏకాదశ = పదకొండు; త్రయోదశ = పదమూడు; పంచాదశ = పదునైదు; సప్తదశ = పదునేడు; నవదశ = పంతొమ్మిది; ఏకవింశతి = ఇరువదొకటి; త్రయోవింశతి = ఇరువది మూడు; పంచవింశతి = ఇరువది ఐదు; సప్తవింశతి = ఇరువది యేడు; నవవింశతి = ఇరువది తొమ్మిది; ఏకత్రింశత్ = ముప్పది యొకటి; త్రయస్త్రింశత్ = ముప్పది మూడు; చతస్రః = నాలుగు; అష్టౌ = ఎనిమిది; ద్వాదశ = పన్నెడు; షోడశ = పదునారు వింశతి = ఇరువది; చతుర్వింశతి = ఇరువది నాలుగు; అష్టావింశతి = ఇరువదెనిమిది; ద్వాత్రింశత్ = ముప్పదిరెండు; షట్త్రింశత్ = ముప్పదియారు; చత్వారింశత్ = నలుబది; చతుశ్చత్వారింశత్ = నలుబది నాలుగు; అష్టాచత్వారింశత్ = నలుబదెనిమిది; ఏతాః సంఖ్యాః = ఈ సంఖ్యలు; మే సంతు = నాకు క్షేమం కూర్చుగాక!

వాజః = ఆహారం; ప్రసవః = అన్న ఉత్పత్తి; అపిజః = పునఃపునః అన్నోత్పత్తి; క్రతుః = యాగాది సంకల్పం; సువః = యాగోత్పత్తి యందు హేతు భూతుడు ఆదిత్యుడు; ఏతేసర్వే = ఈ వాజాదులన్నియు; మే సంతు = నాకు సంపుష్టిగా కల్గుగాక.

వాజః=చైత్రం; ప్రసవః=వైశాఖం; అపిజః=జ్యేష్ఠం; క్రతుః=ఆషాఢం; సువః=శ్రావణం; మూర్ధా=భాద్రపదం; వ్యశ్నియః=ఆశ్వయుజం; అంత్యాయనః=కార్తీకం; అంత్యః=మార్గశిరం; భౌనః=పుష్యం; భువనః=మాఘం; అధిపతిః=ఫాల్గుణం; ఏతే తదాసీమ్=ఈ మాసకాలాలు నాచే తృప్తినొంది; ప్రీణంతు=కార్య క్షమములగుగాక!

ఒకటి, మూడు, ఐదు మున్నగు బేసి సంఖ్యలుగా నాకు గల పదార్థములుండు గాక. నాలుగు, ఎనిమిది, పన్నెండు మొదలైన సరిసంఖ్యలవలె నా సంపదలు వృద్ధి పొందుగాక. ఆహారము, ఆహారోత్పత్తి, మరల మరల ఉత్పత్తి, యాగ భోగాది విషయములు, మున్నగునవి నాకు కలుగుగాక. చైత్ర వైశాఖాది మాసములు అనగా సర్వకాలములు మా యజ్ఞములచేత తృప్తి నొంది మాకు శుభము జయము చేకూర్చు గాక!

ఓం శాంతి శ్శాంతిః శ్శాంతిః